# దేవుడు - మానవుడు

(విశ్వకర్మ సృష్టి రహస్యము)

వేదవిజ్ఞానమును ఆధునిక విజ్ఞాన శాస్త్రముతో సమన్వయ
పరచబడినది మరియు మానవుని ఆదర్శ జీవన విధానమును
తెలియజేయు విజ్ఞాన గ్రంథము



విశ్వకర్మ సృష్టి విశ్వకర్మ భగవానుడు


రచయిత:

"విశ్వకర్మ సాహిత్య రత్న"

కొచ్చెర్ల చిన్మయాచార్య విశ్వకర్మ(చిన్నారావు)

రిటైర్డ్ హెడ్‌మాష్టర్, గుమ్మళ్ళదొడ్డి, తూ॥గో॥జిల్లా.

# దేవుడు - మానవుడు

(విశ్వకర్మ సృష్టి రహస్యము)

ప్రథమ ముద్రణ : ఏప్రియల్, 2002
ప్రతులు : 1000
వెల : రూ.50/-





ప్రతులకు : కె. రమేష్ కుమార్, H.M.
B.Sc., B.Ed.
కోరుకొండ,
తూ.గో.జిల్లా, ఆం.ప్ర.
ఫోన్.496796 (0883)

## అంకితము

శ్లో॥ కుర్వతి యజ్ఞ కర్మాణి, మహాదానాని షోడశ
యేహతా స్సమరే వీరా, స్తే క్రీడంతి సురై స్సమమ్.

తా॥ యజ్ఞము, షోడశదానములు చేయువారును,
యుద్ధము నందు మరణించువారును మాత్రమే ఆ
స్వర్గమున కేగి దేవతలతో సమానముగా
క్రీడింపగల్గుదురు.

దేశరక్షణకు ప్రాణములుపణముగా పెట్టి దేశాన్ని అహర్నిశలు కాపాడుచున్న త్యాగధనులు, నిజమైన దేశభక్తులు భారతీయ వీరజవానులకు 1999 కార్గిల్ యుద్ధ స్ఫూర్తితో అంకితము చేయుచున్నాను.

అభినందనలతో.....



ఈ గ్రంథము

శ్రీ.శ్రీ.శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము

వారి ఆర్థిక సహాయముతో ముద్రింపబడినది..

ROC No. Edt 5/849/2000

# పరిచయము



## కొచ్చెర్ల చిన్మయాచార్య విశ్వకర్మ

(కె. చిన్నారావు)

ప్రధానోపాధ్యాయుడు మం.ప.ప్రాథమిక పాఠశాల

**గుమ్మళ్ళదొడ్డి-533 289**

గోకవరం మండలం, తూ॥గో॥జిల్లా, ఆం॥ప్ర॥

తొలి రచన: "విశ్వకర్మ భగవానుడు"

బిరుదము: "విశ్వకర్మ సాహిత్య రత్న"

బిరుదు ప్రదానము చేసినవారు:

**"సాహిత్య బ్రహ్మ" డా॥వి.వి.ఎల్. నరశింహారావుగారు**

మాజీ డైరెక్టరు - ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్య లిఖిత గ్రంథాలయ సంస్థ, హైదరాబాద్

సభాపతి - ఆంధ్ర ప్రదేశ్ విశ్వబ్రాహ్మణ ధర్మపీఠం, హైదరాబాద్.

ఆస్థాన కవి - శ్రీ మద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామివారి దేవస్థానం, కందిమల్లయ్యపల్లె.

# ముందుమాట

"ఆత్మజ్ఞానమునకు ఒక్క మహా వాక్యముపై దృఢ విశ్వాసము చాలును
పరులకుపదేశించుటకు అనేక గ్రంథముల అధ్యయనము అవశ్యకమగును"
"రామకృష్ణ పరమహంస"

**శ్లో. సర్వోత్కృష్టం పరంజ్ఞానం జ్ఞానం త్రైలోక్య దుర్లభం**

**తస్మాత్సర్వ ప్రయత్నేన జ్ఞానమే వహి సాధయేత్.** "వి. క. పు"

పరమాత్మ విషయకమైన జ్ఞానము సర్వ ప్రపంచమున కంటెను శ్రేష్ఠమైనది. ఇది ముజ్జగముల యందును దుర్ల భమైనది. కావున మానవుడెల్ల ప్రయత్నముల చేతను జ్ఞానమునే సాధించవలయును.

అట్టి పరమాత్మను గూర్చిన (బ్రహ్మ) జ్ఞానమును ఎవ్వరును సంపూర్ణముగా నెఱుంగజాలరు. ఆ పరబ్రహ్మమును గూర్చి ఎంత చెప్పినను స్వల్పమే యగును. ఆజగత్కర్తయైన విశ్వకర్మ పరమాత్మ యొక్క జగన్నిర్మాణ కార్య క్రమమునుగూర్చి తెల్ప బూను కోవడము సాహసమే అయినను ఆదైవ ప్రేరణయే నన్నీ పనికి పురికొల్పినది. మహాత్ములు వ్రాసిన గ్రంథములు చదివి చదివి అందు నేను గ్రహించి నంతమేరకు మాత్రము సంకలనము
చేయుట జరిగినది. తప్పులు ఉన్నయెడల విజ్ఞులు మన్నించ వలసిందిగా సవినయముగా మనవి చేసుకొనుచున్నాను. తప్పులున్నయెడల తగు సూచనలిచ్చిన తదుపరి సవరించుకొనగలవాడను. "దేవుడు మానవుడు" (విశ్వకర్మ-సృష్టిరహస్యము) అను ఈరచనలో నాకు ఉపకరించిన గ్రంథాలు ముఖ్యంగా కొవ్వూరి బాలకృష్ణారెడ్డి గారి రచనలు 'భగవంతుడు వేదవేద్యుడు' 'సూర్యుడుమానవుడు' 'విచిత్రవిశ్వ విజ్ఞాన విభూతి'. "కీర్తి శేషులు "దర్శనాచార్య" డా. కొండూరు వీరరాఘవాచార్యులు గారి ఋగ్వేద, యజుర్వేద దిగ్దర్శనములు" మరియు బ్రహ్మశ్రీ చిలుకూరిసూర్యనారాయణ గారి "దివ్యవాణి". ఇంకను తిరుమల తిరుపతి దేవస్థానమువారు.

ఆ శ్రీనివాసుని ఆశీస్సులతో అందించిన "హిందూధర్మ పరిచయము స్తోత్రమంజరి" మొదలగునవి. ఇటువంటి మంచి రచనలు అందించిన వారికి నాకృతజ్ఞతాభివందనములు సమర్పించు కొనుచున్నాను.

ఈరచనకు శ్రీ కొవ్వూరి బాలకృష్ణా రెడ్డిగారి రచనలు పూలదండ లోని దారమైతే డా. కొండూరు వీర రాఘవాచార్యులు గారి రచనలు అపూలదండలోని పుష్పములు. తిరుమల తిరుపతి దేవస్థానమువారి హిందూధర్మ పరిచయము స్తోత్రమంజరి లోని విషయములు ఆదండలో చివర కట్టిన పుష్పగుచ్ఛమైనది. కావునఆస్తికులైన భక్త మహాశయులారా అందుకొని ఆ అంతర్యామియైన విశ్వకర్మ భగవానుని కంఠాన అలరించి ఆయన అనుగ్రహమునకు పాత్రులుకండు.

# అంతర్దర్శనము

"సాహిత్యబ్రహ్మ" : డా. వి.వి.యల్. నరసింహారావు M.A., Ph.D.,

రిటైర్డ్ డైరెక్టర్ : రాష్ట్ర కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖ.

విశ్వకర్మ సాహిత్యరత్న బిరుదాంకితులైన బ్రహ్మశ్రీ కొచ్చెర్ల చిన్మయాచార్య విశ్వకర్మగారు రచించిన దేవుడు-మానవుడు అను ఈ అభినవ గ్రంథము విశ్వకర్మ సృష్టిరహస్యమును గురించి విశదికరించు ఒక బృహత్ప్రయత్నము. విశ్వకర్మ సంస్కృతికి సంబంధించిన పంచార్షేయతత్త్వము, మానవ జీవితకు ఉపకరించు పంచవృత్తులు మొదలైన అనేకాంశములను ఈ గ్రంథము సూక్ష్మ దృష్టితో వివరించుచున్నది.

అన్నిటికంటే ముఖ్యముగా దేవునితో మానవునకుగల సంబంధమును ఈగ్రంథము సర్వజన సంవేద్యముగావించుచున్నది. ఆసక్త్య నాస్తిక్యముల నడుమ మనుస్మృతి పాత్రను కుడా ప్రస్తావించుచున్నది. అంతేకాదు, ఆధునిక ఖగోళశాస్త్ర దృష్టితో గ్రంథములకు మానవునకుగల సన్నిహితత్వమును కూడా ఈ గ్రంథము వివరించుచున్నది.

గ్రంథకర్తయైన శ్రీ చిన్మయాచార్యుడు అనుభవశాలియగు అధ్యాపకుడగుటచే విషయ నిరూపణములో పఠితృసౌలభ్యమును కూడ దృష్టియందుంచుకొని రచన సాగించినట్లు తోచుచున్నది.

ప్రస్తుత కాలమున ఇట్టి గ్రంథముల ఆవశ్యకము ఎంతేని కల దృష్టించును రచయిత అంతరదృష్టి అభినందనార్హము

27-2-2000 వి. వి. యల్. నరసింహారావు

శ్రీ సరస్వత్యైనమః

# ఒక మాట

ఒక పుస్తకం వెలుగులోకి రావాలంటే ఆ పుస్తక రచయిత ఎన్నిపాట్లు పడిందీ పాఠకునకు తెలియాలన్నా దానిని గూర్చి నాలుగు మాటలు వ్రాసే వ్యక్తి సామర్థ్యాన్ని బట్టి ఉంటుందనడంలో అతిశయోక్తి లేదు. మిత్రులు శ్రీ చిన్నారావు గారు " దేవుడు - మానవుడు" అనే గ్రంథ రచనకు ఎంతో శ్రమించారని ఈ పుస్తకాన్ని చేత ధరించిన విద్వాంసులు వారికందరికీ తెలుస్తుంది.

విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్ అన్నట్లు ఇందలి విషయము అంతటి విలువ కలది. దానిని వివరించుటయే నా ప్రయత్నం.

వేదాలు 5. ఇవి అపౌరుషేయాలు. మనువంశం వారు ఋగ్వేదాన్ని, మయ సంభూతులు యజుర్వేదాన్ని, త్వష్టవంశము వారు సామవేదాన్ని, శిల్పి వంశము వారు అధర్వణవేదాన్ని, విశ్వజ్ఞ వంశము వారు ప్రణవవేదాన్ని అధ్యయనం చేయాలి. విశ్వకర్మ తన చేతులతో స్వర్గాన్ని, పాదాలతో భూమిని సృష్టించాడు. భూమి పై గల మానవుడు మాయచే బంధితుడు. ఆ సృష్టించిన దేవుడు, అంటే నిర్వచించాలంటే "విశ్వమంతటికి ఐహికాముష్మిక పారమార్థికత నొసంగువాడే దేవుడు." అండపిండ బ్రహ్మాండములను సృష్టించి వాటి స్థితి, గతి శక్తుల, ధర్మమును సర్వకాల సర్వావస్థలయందును కాపాడుచున్న అవిశ్రాంత జగత్కర్మలను ఆచరించుచున్న కరుణామయుడు దేవుడు. ద్యావాపృథువులను సృష్టించి పాలించువాడు. సృష్టి స్థితి లయ తిరోధాన, అనుగ్రహములను కర్మల నాచరించువాడు ఆ దేవుడు. అతడే "విశ్వకర్మ" అని ఋగ్వేదం చెప్పింది. అతడు సూర్యుని కంటే ఎన్నోరెట్లు అధిక ప్రకాశం గల పరంజ్యోతి స్వరూపుడు. మానవుడు కోరేది స్వర్గము. స్వర్గమంటే జ్ఞానవంతుడైన మానవుడు కోరుకునే దుఃఖరహితమైన శాశ్వతానంద నిలయము అని అన్ని మతముల విశ్వాసులు ఈ విషయంలో కొంత మార్పు చేసి హిందూ మతస్థులను తమ తమ మతాలలోకి తీసుకు వెళ్ళే ప్రయత్నం జరుగుతున్నా ఆ ప్రయత్నం నెరవేరలేదు.నెరవేరదు.

దేవుడగు ఆ విశ్వకర్మకు పుత్రులు ఐదుగురు.1) మనువు 2) మయుడు 3) త్వష్ట 4) శిల్పి 5) విశ్వజ్ఞుడు అనువారు వీరే పంచబ్రహ్మలు. వీరు సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహములనే కర్మలకు, సృష్టికి ప్రవర్తకులు. విశ్వకర్మ భగవానుని పంచముఖములైన శివుడు, మూర్తి, అమూర్తి, కర్త, కర్మ, అనువానికి సమముగా శివుడు, విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుడు, సూర్యుడు, అను వీరు, ప్రకృతికే కట్టుబడి ఆయా యుగాలలో ఆయా పేర్లతో పిలువబడినారు.వీరు ఎన్నో యుగాలనుండి తమ ధర్మాలను నిర్వర్తిస్తున్నారు. యుగములు నాల్గు అని కొందరికిఅభిప్రాయం కాగా ఇంతకు ముందు గడచినవి 14 కాగా అవి విశ్వకర్మచే సృష్టించబడి ముగియగా ఇప్పటి చతుర్యుగములతో కలసి 18 అయినవి. ప్రతి యుగానికి ఎంతో కొంత వైలక్ష్యము గలదు. గడచిన యుగాలు 14 యొక్క పేర్లను లక్షణాలను యీ రచయిత చక్కగా వివరించారు. అవి 1) అనంతము 2)అధ్భుతము 3) తమందము 4) తారకము 5) అండజము 6) భిన్నజము 7) భిన్నాయత్తము 8) అభ్యాంతము 9) అనభ్యాంతము 10) అనీరణము 11) మనీరణము 12) మన్వారణము 13) విశ్వారణము 14) విశ్వసృష్టి అనునవి తర్వాత యుగములైన కృత, త్రేత, ద్వాపర, కలియుగాలు.

దేవయుగంలో గాయత్రి నుండి సమస్త దేవతలు విశ్వకర్మచే సృష్టించబడినవి. వీరే గోత్రార్షులు, వారే సానగ, సనాతన, అహభూన, ప్రత్నసుపర్ణులు, విశ్వకర్మ భగవానుని నేత్ర కిరణాలు. సృష్టి నిర్మాణము యొక్క విధానము ఈ క్రింది శ్లోకమున వేద విదితము, స్త్రీ పురుషులు కలయికయే సృష్టికి ఆధారము. ఇద్దరూ కారణులే. విష్ణు, బ్రహ్మలే సృష్టికి పూర్తి బాధ్యులు అని

శ్లో॥ విష్ణుర్యోనింకల్పయతు త్వష్టా రూపాణి పింశతు !
ఆ సించతు ప్రజాపతిః ధాతా గర్భం దధాతుతే!!

బ్రహ్మ, విష్ణువులు తర్వాత ఇంద్రుడు, నారును, నీరు పోసి పెంచి పోషించుచున్నాడు. ఇంద్రుడు తన కర్తవ్యాన్ని, అలా నిర్వర్తిస్తూ ఉండును. అజ్ఞానమున కొందరు అతనిని స్త్రీలోలుడని, అహల్యాజార చోరుడని నిర్వచించారు. వారట్లు చెప్పట దురదృష్టము. అహల్య అను పదానికి హలము తాకిన నేల అను అర్థం కలదు. హలముతో (నాగలి) నేలను దున్నగా ఆ నేలపై వర్షించి సస్యౌషధములను మొలిపించి మానవుని మనుగడకు ఇంద్రుడు మార్గదర్శకుడు అని చెప్పట తనను గాని ఆయన దుష్టవర్తనను చెప్పవీలులేదని, ఇది వేదమందలి గూఢార్థము. పాలనకు ఇంద్రుడు పుష్కల వర్తకాది మేఘములకధిపతి, భూమి మీద వర్షానికి అతడే కారకుడు.

విష్ణుపురాణంలో విశ్వకర్మ నుండియే ఈ సృష్టి పుట్టినది అనియు విశ్వానికి అయనయే ప్రభువు అనియు చెప్పబడినది. "ప్రపంచ మంతయు పరమాణు సమూద్భూతము, కులాలుడు, (కుమ్మరి) కుండలకు ఎట్లు సృష్టికర్తయో ఈ లోకములను సృష్టించినవాడే విశ్వకర్మ భగవానుడు.

శ్లో॥ అజాయుత జగత్సర్వం సృష్ట్యాదౌ విశ్వకర్మణః
స ఏవ కర్తా విశ్వస్య విశ్వకర్మా జగత్పతిః

ఇంత వింతగానున్న ఈ సృష్టియు అశాశ్వతము. సృష్టికర్త సృష్టి వినాశకుడు కూడా అనుటలో సందియములేదు. దీని ప్రమాణము 10 ప్రక్కన ముప్పది సున్నలు పెట్టిన పర్వడు సంఖ్యకు సమానమనియు, క్షణ క్షణానికి మారుతూ ఎన్నో దశలకు మార్పులకు గురి అవుతూ ఉంటుంది. ఎన్నో అద్భుతాలు కానవస్తుంటాయి. విష్ణువు దశావతారాలను ఎత్తి దుష్టశిక్షణ శిష్టరక్షణ కావలెనన్నట్లు వేదాలే కాక భాగవతం కూడా వివరించింది. హైడ్రోజన్ మేఘములే సృష్టినిర్మాణానికి కారణములు. అందుద్భవించినవే పాలపుంతలు. పాలపుంతలో మన శాస్త్రాలు లెక్కించ 25 కోట్ల నక్షత్రాలలో మన సూర్యుడొకడు. భూగ్రహము పుట్టుకకు ఒక మహోద్భుతగోళము సూర్యుని యొక్క ప్రేలుడు కారణము. గ్రహముల పుట్టుకకు ఆ పాలపుంతయే మూలము.

ఇలా సృష్టి రహస్యాన్నే కాక మానవుని పుట్టుక, మానవులలో రకాలు, వారి చేష్టలు, దీని వలన వారి నుండి లోకానికి కలిగే కష్టనష్టాలు ప్రయోజనాలు విపులంగా వివరించారు చిన్నారావు గారు. గురుశిష్యుల మధ్య ఉండవలసిన లక్షణాలు వివరించారు.

ఆదర్శ గురుశిష్యుల సత్సంబంధమే లోకానికి వెలుగును ప్రసాదిస్తుంది. "సహనావవతు, సహనౌభునక్తు, సహవీర్యం కరవావహై తేజస్వినా వధీతమస్తు మావిద్విషావహై"

ఇంకా ఆదర్శయువతి, మాతృమూర్తి, నరపశువులు, నరరూప దేవతల గూర్చి చెప్పినారు. ఈ గ్రంథ పఠనానంతరం నాస్తికులు ఆస్తికులుగాను, అజ్ఞానులు విజ్ఞానులగుదురనుటకు సందేహం లేదు. ఈ గ్రంథాన్ని రచించడంలో చిన్నారావుగారు కృతకృత్యులయ్యారనే చెప్పాలి. "గ్రంధాన్ని న్యాయంగా చదివి అభిప్రాయాన్ని వ్యక్తం చేయగల్గినాను. వీరికి పురోభివృద్ధి కావాలని కోరుతూ భగవానుని ఆశీస్సులు వీరికి లభించాలని ఆశిస్తూ,

ఇట్లు

(సం)..............................

**P.K.S.Rama Sasthry,** M.A.B.Ed.
భాషా ప్రవీణ, ఆశుకవి, వ్యాకరణ మంజూష
Rtd. Telugu Lecturer, Korukonda.

# నాణేనికి అటు-ఇటూ !

**-కర్రా కార్తి కేయ శర్మ** ఎం.ఎ., తెలుగు పండిట్.

**॥ఆపరితోషా ద్విదుషాం**
**నసాధుమన్యే ప్రయోగ విజ్ఞానమ్.**
**బలవ దపి శిక్షితానా**
**మాత్మన్య ప్రత్యయం చేతః**

ఇది కాళిదాసు

సుశ్లోకం ఎంతటి ధీమంతుడయిన, సుదీర్ఘమైన పరిశ్రమ చేసినవాడయినా, ప్రతిభా-వ్యు త్పత్తుల పడుగుపేకలతో మన్నికయిన పండితుడయినా-మిగిలిన విద్వాంసులు ఆమోద ముద్రకై ఎదురుచూడటం పరిపాటి ఇది అవసరం కూడా! మహాకవి కాళిదాసు వంటి వాడే ఇటువంటి అభిప్రాయం వెలువరించాడంటే - ఇక మన మెంత?

శివశ్రీ కె. చిన్నారావుగారు చిరకాలం ఉపాధ్యాయులు గా పని చేయుచూ, తూర్పుగోదావరి జిల్లాలో అనేక మందికి సుపరిచితులు వీరు వ్రాసిన మొదటి గ్రంథం "విశ్వకర్మభగవానుడు" అనేక మంది ఆమోదం పొందింది. ఆప్రేరణతోవారు "దేవుడు-మానవుడు" అనే ఈ గ్రంథాన్ని రచించారు. ఇందులో విశ్వకర్మ, దివ్యవేదము, కర్మ, మతము, పంచబ్రహ్మల అవతరణ మొదలగు విభాగములున్నవి.

ఒక కథవలె, నవలవలె, తేలిక పాటి వ్యాసాల వలె కాకుండా వీటిని చదవడానికి ఏకాగ్రత - దేవుడు ఉనికిని తెలుసుకోవాలన్నా తపన - విరాట్‌పురుషుని యొక్క తత్వాన్ని దర్శించాలనే ఏకాగ్రత - ఇన్ని మూల ధర్మాలు మనలో జాజ్వల్యం కావాలి ! అప్పుడే ఈపుస్తకము మన మస్తిష్కములోని సందేహాలకు జవాబిస్తుంది.

నేడు టెలివిజన్ అనేక ఛానళ్ళతో పిల్లల మర్రిలా విస్తరించి తెలుగువాడిలో చదివే శక్తిని హరించి వేసింది. ఫలితంగా గ్రంథ పఠనం మందగించింది. పుస్తకాలు ముద్రించడం, ముద్రించిన పుస్తకాలను విడుదల చేయ్యడం భగీరథ ప్రయత్నంగా మారింది.నవల, కథ, కవిత వీటికే పాఠకులు కరువయిన నేటిరోజుల్లో ఇటువంటి తాత్విక రచన ముద్రించడానికి శ్రీ చిన్నారావుగారు పూనుకోవడం సాహసమే సాహసంతో అడుగు ముందుకు వేస్తున్న వారికి నా అభినందనలు! షష్ఠి పూర్తికి దగ్గర పడుతున్న వయస్సు కలవారయినా, చిన్నారావుగారు గర్వ మెరుగని సహృదయశీలి. ఎన్నో విషయాలు తెలుసున్న వారయినా ఇంకా తెలుసుకోవాలనే నిరంతర విద్యార్థి

వారి బహుగ్రంథ పఠనం - బహు విషయమథనం ఈ గ్రంథ రచనకు జీవధాతువులు అందుకే ఈ గ్రంథంలో చిన్నారావుగారు తమదయిన ముద్రను సాధించారు.

"కాలరాత్రి చివరి కాలమున దాని చిచ్ఛక్తి ప్రభావమున దానిలోకి అత్యధిక, అత్యల్ప పీడన శక్తిగల ప్రదేశములు ఏర్పడుటచే అందు పరాశక్తి రూపమైన సుడిగాలులు సహజముగ అనంత సంఖ్యలలో బలభేదములతో విజృంభించెను. ఆదిశక్తియందలి శక్తిఅంశలు సుడి గాలిలో త్రిప్పబడి పోగుపడి ఓంకార శబ్దము తో పైకి లేచును దాని ఊర్ధ్వకోణమున అత్యంత సూక్ష్మశక్తికి సంబంధించిన అంశలు కుదింపబడి శక్తి బిందువులుగా రూపొందును. ఇట్లు కేంద్రీకృత మయిన "బిందువు" అంశారూపముగా ఊహించవలయును. ఈ బలభేదములతో కూడి పరాశక్తి బిందువుతోసృష్టికి అవసరముగు పలురకములగు అణువులయినది. అవియే అణు విద్యుదయస్కాంతాదిశక్తులు "పంచభూతములు" పుట్టుటకు బీజములయినవి"గ్రంథ కర్త యొక్క ఈ అభిప్రాయాన్ని పండితులులోతుగా పరిశీలించవలసిన అవసరమున్నది. ఇటువంటి విలువైన మాటలు ఈ గ్రంథంలో ఎడె-నెడ మనకు దర్శన మిస్తాయి.

"మరణించిన ప్రాణులు స్వర్గాది లోకాంతరములకు వెళ్ళిపాపపుణ్యములు అనుభవించి మరల మేఘములందు చేరి అటనుండి వాననీటి ద్వారా భూమిమీద పడి ఓషధులలో ప్రవేశించి అటనుండి పురుషుని వీర్యమున చేరి స్త్రీ గర్భమున ప్రవేశించి స్థూల శరీరమును పొందుచున్నారని "రచయిత వెలు వరించిన అభిప్రాయము" "పునరపి జననం - పునరపి మరణం"అనే దానికి సున్నితమైన వ్యాఖ్యగా ఉంది. ఈ గ్రంథంలో విశ్వకర్మ ఆవిర్భావం, వారిలీలా విశేషములతో పాటు ఖగోళమునకు సైన్సుకు సంబంధించిన ఎన్నో మహత్తర విషయములున్నవి. "బ్రహ్మాండ పిండమనెడి హైడ్రోజన్ మేఘము మహాశక్తి యొక్క అసలురూపము అది శివలింగాకార మందలి. పాన మట్టమును సూచించును. ఆపిండమునుండి వెలువడు పాలవెల్లుల లింగాకారపు మహోజ్వాలా జ్యోతులే రూపుదిద్దుకొనిన మహాశివుడు'' ఈ వివరణ రచయిత పరిశోధనకు నిలువుటద్దము

పురాణ ప్రసిద్ధమైన విషయాలను సైన్సుతో అను సంధానముచేసి హేతుదృష్టితో పరిశీలన చేసిన గడుసు పోకడగల రచయిత
శ్రీ కె. చిన్నారావుగారు.
మంచి గ్రంథాన్ని రచించినందుకు వారిని అభినందిస్తున్నాను.
వెలమపేట, గోకవరం- 533 286,
3-12-99
తూ॥గో॥జిల్లా.

# పంచభూతములు

**p.s బ్రహ్మాచారి** M.Sc M.Phil
Lecturer in Physics, Govt,Junior College
**Korukonda,** E.Godavari Dt.

పంచభూతములు అనగా ఆకాశము, అగ్ని, వాయువు, జలము, భూమి. నీలం రంగులో కనిపించే అనంత విశ్వాంతరాళ మే ఆకాశము. ఆకాశము నీలంరంగు లో కనిపించడానికి గలకారణం కాంతి పరిక్షేపణం (scattering of light).కాబట్టి పరిక్షేపణ చెందిన కాంతియే ఈ నీలిరంగు ఆకాశము. దీనినుండి అగ్నిపుట్టినది.

అగ్ని అనగా ఉష్ణశక్తి. శక్తి నిత్యత్వ సూత్రము (Law of conservation of energy) ప్రకారంఒక రూపంలో శక్తి మరియొక రూపంలోనికి మార్చవచ్చు. ఇచ్చటి కాంతి (ఆకాశం) శక్తి ఉష్ణ (అగ్ని) శక్తి రూపంలోనికి మారినది. శక్తి నుండి పదార్థము పుట్టినది. ఐన్ స్టీన్ ప్రతిపాదించిన ద్రవ్యరాశి-శక్తి తుల్యతా నియమం (Prinicple of mass-EnergyEquivalence) లో శక్తి ద్రవ్యంగా అనగా పదార్థంగా మారుతున్నది అని తెలుపుచున్నది.

$E=Mc^2$

E= శక్తి

M= పదార్థ ద్రవ్యరాశి

C= కాంతివేగం

పదార్థం మొదట అతిచిన్న పరమాణువు ఐన హైడ్రోజన్ రూపము పొందినది. ఈ హైడ్రోజన్ మేఘం వాయు రూపంలో ఉంటుంది. హైడ్రోజన్‌లో కేవలం ఒక ప్రోటాన్, ఒక ఎలక్ట్రాన్ ఉంటాయి.ఇటు వంటి ప్రోటాన్, ఎలక్ట్రాన్‌లు వివిధరకాల కలయిక వలననే వివిధ రకాల పదార్థాలు ఏర్పడ్డాయి. పదార్థములో న్యూట్రాన్ అనే కణం ఉన్నప్పటికి అది ప్రోటాను, ఎలక్ట్రానుల సంయోగము వలన ఏర్పడినదే. హైడ్రోజన్ మేఘం విస్ఫోటనం చెందిన తరువాత ఏర్పడిన వాయు రూపంలోని వివిధ పదార్థాలు శక్తిని ఉద్గారం చేయుటం వలన వాటి ఉష్ణోగ్రత తగ్గి అవి క్రమంగా ద్రవస్థితిలోనికి మారాయి. అదే జలము. ఇచట జలము అనగా ద్రవపదార్థమని అర్థం చేసుకోవాలి. ఈ పదార్థ ద్రవరూపంలో ఉన్నప్పడు, ద్రవాలకు ఉండే "తలతన్యత" (Surface Tension) అనే లక్షణం కారణంగా అవి గోళాకృతిని పొందాయి. అందు వలననే విశ్వంలో ఉండేఖగోళ వస్తువులు అనగా భూమి, చంద్రుడు, ఇతర నక్షత్రములు అన్నీ గోళాకారంలో నే ఉన్నాయి.

ద్రవరూపంలో ఉన్న ఈ ఖగోళ వస్తువులు శక్తిని ఉద్గారం చేయటం వలన వాటి ఉష్ణోగ్రత తగ్గి అవి క్రమంగా ఘనీభవించి, అదే గోళాకృతిలో ఉన్నాయి ఈ ఘనీభవించిన పదార్థమే భూమి. ఈవిధంగా కలిగిన సృష్టి రూపాంతరాలే ఈ పంచ భూతములు. వీటినుండే మనం నిత్యం శక్తిని పొందుతున్నాము,

భగవంతుని నీలివర్ణపు కాంతిగల వానిగా పురాణములో చెప్పబడినది. ఆకాశము కూడా నీలం రంగులోనే ఉంటుంది. ఆకాశమునకు గల నీలివర్ణము లోనే భగవంతుని చూపడంలో గల ఔచిత్యం ఏమనగా ! సర్వసృష్టికి మూలం ఐన ఆకాశమే భగవంతుడు.

ఆకాశము (కాంతి) లేకుండా దేనినీ చూడలేము

అగ్ని (శక్తి) లేకుండా ఏపనీ చేయలేము.

వాయువు(గాలి), జలము లేకుండా జీవకోటి జీవించలేదు

భూమి సమస్త జీవకోటి మనుగడకు ఆధారము, ఇది లేకుండా మనుగడ సాధ్యం కాదు.

అనగా నిత్యము జీవకోటి మనుగడకు అవసరమైన శక్తి యొక్క రూపాంతరములే ఈ పంచభూతములు లేదా భగవంతుడు. నాస్తికులు భగవంతుడే లేడు అనవచ్చుగానీ, శక్తి లేదని అనలేరు గదా!

పదార్థములో సూక్ష్మాతి సూక్ష్మమైన పరమాణువు ఏవిధంగా నిర్మిత మైనదో ఆవిధంగానే విశ్వం అంతా నిర్మితమై యున్నది పరమాణువులో ఎలక్ట్రానులు తమ చుట్టూ తాము తిరుగుతూ కేంద్రకం (Nucles) చుట్టూ ఏవిధంగా తిరుగుతున్నాయో, అదేవిధంగా గ్రహాలు కూడ తమ చూట్టూ తాము తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరుగుతాయి. మిగిలిన విశ్వమంతా కూడా ఈ విధంగానే ఉంటుంది. అనగా పరమాణువు యొక్క ప్రతి రూపమే విశ్వము. అణువు కన్నా అణువు, అనూహ్యమైన రూపము ఈ రెండూ కూడా భగవంతుడే.

న్యూటన్ గురుత్వాకర్షణ సిద్ధాంతం ప్రకారం ఈగ్రహాలన్నీ నిర్దిష్ట కక్ష్య లో పరిభ్రమిస్తుంటాయి. గురుత్వాకర్షణ లేని నాడు గ్రహాలన్నీ గతులు తప్పి ఒక దానితో ఒకటి ఢీకొని విశ్వం మొత్తం నాశనంఅవుతుంది. ఇదే విధంగా మానవుడు కూడా నిర్దిష్టమైన నియమాలకు కట్టుబడి ఉండాలి.

అప్పుడే జీవకోటి సృష్టి ఉన్నంత కాలం మనుగడ సాగించ గలుగుతోంది. నియమ నిబంధనలను వదిలి వేసిననాడు మానవుని జీవితం కూడా గతి తప్పిన గ్రహం వలే వినాశం చెందుతుంది.

అందువలననే మానవుడు సృష్టి నియమాలను తెలుసు కొని దానికి అనుగుణంగా జీవనం సాగించాలి. సృష్టిలో ప్రతి ప్రాణిని జీవనం సాగించేటట్లు చెయ్యాలి. అప్పడే మానవుని జీవితం సార్ధకం అవుతుంది

**"ధర్మాన్ని (సృష్టి) కాపాడితే అది మనల్ని కాపాడుతుంది.**
**ప్రకృతిని కాపాడితే అది మనల్ని కాపాడుతుంది".**

చిన్నారావు మాష్టారు గారు రచించిన ఈ పుస్తకంలో పైననేను ఉదహరించిన విషయాల వంటివి అనేకం దర్శనం ఇస్తాయి. దీనిలో వేదాలను, పురాణ విషయాలను విజ్ఞాన శాస్త్రం పరముగా వివరించడం జరిగింది. ఈ విషయముతో రచయిత కృతకృత్యులయ్యారు. విషయము నేరుగా మనస్సును తాకేటట్లు, మెదడును ఆలోచింప చేసేటట్లు ఉన్నది.

"విజ్ఞాన శాస్త్రం" సామాన్య మానవునికి అందుబాటులోనికి రాని రోజులలో ఇదే విషయాన్ని వేదాల రూపంలో ఆస్తి కత్వాన్ని జోడించి చెప్పారు. కాని ఈరోజులలో "సైన్సు" చెప్పిన దంటే ఆ విషయాన్ని మనం నమ్ముతాం కాని ఇదే విషయం వేద పురాణంలో ఉన్నదంటే మనం నమ్మలేని స్థితికి చేరుకున్నాము. ఇటువంటి మనుషులలో, మనస్తత్వాలలో మార్పు తీసుకురావడానికి రచయిత చేసిన ప్రయత్నరూపమే ఈపుస్తకం.

"సమాజం సక్రమమైన మార్గంలో నడవాలంటే మనిషి ఎటువంటి నియమిలను పాటించాలి.

"భగవంతుని సృష్టి తన నుండి మనలను ఏమి నేర్చుకొమ్మని చెబుతున్నది." అనేవి సరళమైన పదజాలముతో రచయిత ఈ పుస్తకములో విపులీకరించారు.

అందువలన ప్రతి వ్యక్తి ఇటువంటి పుస్తకాలను చదివి సత్ప్రవర్తనము అలవరచుకొని మంచి సమాజ స్థాపనకు, దేశపురోభివృద్ధికి తమ వంతు కృషి చేయాలి.

# విషయసూచిక

# ఉపోద్ఘాతము

దేవుడు ఒక్కడే అనునది అందరికీ తెలిసిన విషయమే హిందువులలో దేవుడు అనే సరికి భిన్నత్వం కనిపించుచున్నది. అనగా హిందువులు ఒకే దేవుణ్ణి వివిధ రూపాలలో కొలుస్తున్నారు. ఈ భిన్నత్వంలో ఏకత్వాన్ని సాధించడానికి చేస్తున్న ప్రయత్నమే ఈ గ్రంథ రచన హిందువులలో అనేక మతముల వారున్నారు ఉదాహరణకు ద్వైతము,విశిష్టాద్వైతము అందులో మరల శైవము, వైష్ణవము, శాక్తేయము, పౌరుషేయము అంతేగాక దేవుడు జోలికి పోకుండా ఉన్న బౌద్ధమతము జ్ఞాన మార్గమును అనుసరించు జైనమతము ఇలా ఎన్నోమతాల వారున్నారు. హిందుమతానికి ఆధారము దివ్యవేదము(పంచవేదములు) విశ్వకర్మ నుండి జనించినవి ఆవేదములలో మొదటిదైన ఋగ్వేదములో అనేక దేవతలకు గల వ్యుత్పత్యర్థము ఏమిటి అని తరచుచున్నప్పుడు సృష్టి స్థితి ల యాది కర్మల నెరవేర్చెడి దేవుడు విశ్వకర్మయని తెలియవచ్చుట చేత "విశ్వ కర్మ భగవానుడు " అను గ్రంథాన్ని వ్రాయుట జరిగింది . అయితే ఈ గ్రంథములో దేవుడను పదమునకు అర్థమును సాధించటంతో బాటు ఆ దేవుడు స్వరూప స్వభావములను అనగా ఆ విశ్వకర్మ భగవానుని భౌతికరూపనిర్మాణత్వమును గురించి తెలుపడమైనది.

దేవుడను పదమునకు అర్థమును సాధించడము, దేవుడు ఒక్కడే యనిస్థిరీకరించు కోవడము, అందుకోసం వేదమును గూర్చియు. కర్మను గూర్చియు విశ్వ నిర్మాణత్వమును గూర్చియు అందు పంచబ్రహ్మములు మరియు పంచశక్తుల ఉత్పత్తిని గూర్చియు మరియు ఏయేయుగములందు అవి సృష్టింపబడినవో తెలియపరచడమైనది. "సర్వం ఈశమయంవిశ్వం విశ్వమేవసఈశ్వం :" అన్నట్టు సమస్తమందు దేవుడున్నాడు. దేవతలందరిలో వివిధ దైవశక్తులున్నవి. దేవతలు ఆదేవుని అవతారములే. అయితే దేవాది దేవుడైన, దేవతలను గూడ సృష్టి చేసిన ఆ విశ్వ కర్మను గూర్చి ఋగ్వేదము లో ఏమి చెప్పబడి ఉంది. తెలిసికొనవలయును దీనినే బ్రహ్మజ్ఞానం అంటారు. అది తెలుసుకొనిన తరువాత నీవు నీ ఇష్టదైవములో ఆ దైవశక్తిని చూడవచ్చును. కావున జీవులేనాటి కైనను ఆకారణ పరబ్రహ్మమును కాంచిననే గాని అమృతులు కాలరని వేదము చెప్పుచున్నది. ఈ రహస్యాన్ని తెలపాలన్నదే ఈ ప్రయత్నము. ఇందు జీవుల ఉత్పత్తి పరిణామములు మానవ జీవిత దశలు ధ్యేయములు కూడా కొంతవరకు వివరించడమైనది చివరగా "విశ్వకర్మ భగవానుని గొప్పతనమును గూర్చి విశేష ప్రజ్ఞను గూర్చియు ఋగ్వేద మంత్ర భావ యుక్తంగా తెలుపుచూ ఆ దేవదేవుని ప్రార్థనా స్తుతులుతో ముగించడమైనది.

# దేవుడు

"దివమ్ సంధమతి దేవః" స్వర్గమును సృష్టించినవాడు దేవుడు.

మం. విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతో బాహురుత విశ్వతస్పాత్ సంభాహుభ్యాంధమతి సంపత త్రైర్ద్యావాభూమింజనయున్ దేవ ఏకః

ఋ.వే. మండలము సూ.మం. 10-81-3

విశ్వమంతటను కన్నులు, ముఖములు, చేతులు, పాదములు కలిగిన విశ్వకర్మ చేతుల చేత దివమును (స్వర్గమును), పాదములచే భూమిని సృష్టించెను.

మం. యఇమా విశ్వాభువనాని ధృషిర్హోతాన్యసీదత్పితానః।
స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః ప్రధమశ్ఛ దవరో ఆవివేశ ॥

ఋ.వే. మండలము. సూ.మం. 10- 81-1

విశ్వసంహార హోమమునకు కర్తయైన విశ్వకర్మ చరాచరములకు తండ్రియై ప్రకాశించినచో అతడు జీవుల కర్మానుభవము కోసము పునః సృష్టిని చేసెను. తనచే సృజింపబడిన ప్రాణుల హృదయ దేశములను ప్రవేశించెను. దీనినే "అనుప్రవేశ రహస్య" మందురు.

"సృష్టికి హేతుభూతమైన అఖండ పరమాత్మ స్వరూపము దేవుడు"

1. దేవుడనగా ధ్యావాపృథువులను (స్వర్గమును, భూమిని) సృష్టించి పోషించి పాలించుప్రభువు.
2. "దివింకల్పయతు దేవాః" స్వర్గమును సృష్టిచేసినవాడు దేవుడు.
3. దైవమనగా దివమను (పగటిని) అనగా తేజమును కల్పించిన పరంజ్యోతి స్వరూపము.
4. దివాంకరోతు దేవః. పగలు అను తేజమును సృష్టిచేసినవాడు దైవము (దేవుడు)
5. ఆంగ్లమున GOD అంటారు. అనగా Generator, Organiser, Dystroyer.
6. తెలుగులో బ్రహ్మ, విష్ణువు, శివుడు అన్నారు. అనగా సృష్టి, స్థితి, లయములను చేయువాడు దేవుడని అన్నారు.

"సృష్టి స్థితి లయా దీని కర్మాణియస్యసౌ విశ్వకర్మణః." అని సంస్కృతమున వేదము తెలిపినది. భాషలెన్నియైన భావమొక్కటే. కావున అందరికి ఒక్కడే దేవుడు. దేవుడనగా దివిని సృష్టించిన వాడు, జీవులకు మోక్షము నీయగలవాడు.

"దేవుడు అనగా కొలిచినవారికి కొంగు బంగారమై కోరికలను తీర్చేవాడు మాత్రమేకాదు. కోరినవారికి కోరనివారికి జాతి,మత,దేశ, కాల భేదములు పాటింపక పిపీలికాది బ్రహ్మపర్యంతము అనగా దేవతలు, రాక్షసులు, మానవులు,జంతువులు, పక్షులు, కీటకములు,చీమలు అను భేదములు లేకుండగను, జీవుడు దొంగా! దొరా! మంచి వాడా చెడ్డవాడా అని ఎంచకుండా పోషించి పాలించుచున్న ప్రభువు అతడు"అండపిండ బ్రహ్మాండములను సృష్టించివాటి స్థితిగతి శక్తుల ధర్మమును సర్వకాల సర్వావస్థల యందును కాపాడుచున్న అవిశ్రాంత జగత్కర్మల నాచరించుచున్న కరుణామయుడు. అతడు అగోచర శక్తి స్వరూపము.జీవుల కర్మానుభవముల నెరవేర్చి మోక్షము నొసంగు దయాసాగరుడు జీవుల పుట్టుకకు పూర్వమే వాటిని పూర్వజన్మ కర్మానుభముల నెరవేర్చుకొనుటకు వాటికి అవసరమగు భోగ్య పదార్థములను ముందుగానే సృష్టిచేసియున్నాడు. అంతేకాని కర్మానుభవములను కాదని కోరికలను తీర్చు శక్తి ఏ దేవతలకు లేదని గ్రహించవలయును.ఇంకను దేవుడనగా ద్యావాప్రథువులను సృష్టించి పాలించువాడు. అతడు సృష్టి స్థితిలయ తిరోధాన అనుగ్రహము లనెడి కర్మలనాచరించువాడు కనుకనే ఆదేవునికి "విశ్వకర్మ" అని ఋగ్వేదము పేరిడినది. భగవంతుడనగా సకలైశ్వర్యములతో బాటు మోక్షమును గూడనిచ్చు వాడని అర్థము. విశ్వకర్మ విశ్వశంభుడని ఋగ్వేదము చెప్పచున్నది.

విశ్వశంభుడనగా విశ్వాని కంతటికి సుఖము నిచ్చువాడని అర్థము. అతడు నిత్యమైన పరబ్రహ్మ స్వరూపుడు నిరాకారుడు ఆయనలో ఎట్టి వికారములు లేవు. సత్యము, జ్ఞానము, ఆనందము, ప్రేమ మున్నగునవి ఆయన ముఖ్య లక్షణములని వేదము తెలుపుచున్నది. అతడు సూర్యుని కంటే ఎన్నో రెట్లు అధిక ప్రకాశముగల పరంజ్యోతి స్వరూపుడు ఆనందరూపమైన ప్రరబ్రహ్మము జీవులను గూడ తనవలె ఆనందాత్మలను చేయుచున్నాడు. సమస్త విశ్వము ఆ ఈశ్వరునిలోనే ఇమిడియున్నది. ప్రతి జీవియందును అంతర్యామిగా దేవుడున్నాడు.

"స్వర్గమనగా జ్ఞానవంతుడైన మానవుడు కోరుకొను దుఃఖ రహితమైన శాశ్వత ఆనంద నిలయము" జీవుల పూర్వజన్మ కర్మ ఫలములను భువిలో అనుభవించి తరువాత భువిలో సముపార్జించిన సత్కార్యాచరణ ఫలితములను దివిలో అనుభవించగలరు. దేవుడు భగవంతుడని కూడ అంటారు. భగవంతుడనగా భక్తుల కోరికలను నెరవేర్చువాడని అర్థము, అనగా మోక్షము నిచ్చువాడని భావము. అతడు జ్ఞానప్రదాత.

రాత్రికనబడు నక్షత్రములు పగలు కానవచ్చుట లేదని ఆకాశమున నక్షత్రాలు లేవని అనరాదు అజ్ఞాన వశమున మంచు వంటి మాయ మనసును కప్పియున్నప్పుడు భగవంతుడు. కానరాని కారణముచే అతడు లేడని అనరాదు. ఆయనకు ఎన్నో నామరూపములు ఉన్నవి. ఋగ్వేదము ఆదేవుని "విశ్వకర్మ" అని పేరిడినది. ఆ జగత్కర్తను హిందువులు ఈశ్వరుడు పరమాత్మ, భగవానుడు అంతర్యామి పరబ్రహ్మము అని భావన చేస్తారు. "ఏ షదేవో విశ్వకర్మమహాత్మాసదా జనానాం హృదయే సన్నివిష్ట : " అని శ్వేతాశ్వరోపనిషత్ చెప్పినట్లుగా సకల జీవులలో జీవశక్తి (ఆత్మ) రూపమున దేవుడు ఉన్నాడు అని విశ్వసిస్తారు. అందుకే వారు ఆ పరమాత్మను వివిధ రూపాలలో కొలుస్తారు. క్రైస్తవులు దేవుడిని యెహోవా అనియు, మహమ్మదీయులు ఆయనను అల్లా అనియు పిలుస్తారు. నీకు నచ్చిన నామ రూప సాయముతో అతనిని పొందగలవు దేవునికి నామరూప భేదములనేవి లేవు.

సగుణ నిర్గుణ బ్రహ్మమునకు భేదములేదు నిష్క్రియునిగా భావన చేసినపుడు అతనిని నిత్యుడని పేర్కొందుము. అతనినే సృష్టి స్థితి లయాది. కర్మలకు కారణునిగా భావన చేసినపుడు సగుణ బ్రహ్మమని పేర్కొందుము. బుద్బుదము నీటిలో పుట్టి నీటిలో తేలి తుదకు నీటిలోనే కలియుచున్నది. అట్లే జీవాత్మయు, పరమాత్మయు ఒకటే. ఇనుమునకును సూదంటురాతికి గల భేదమే నరునికి, భగవంతునకి గలదు.

అట్లయిన ఆకర్షింపబడకున్నాడేల? బురదలో పడియున్న ఇనుము. సూదంటురాయిచే ఆకర్షింపబడనట్లు మాయలో పూడి పడియున్న మానవుడు దేవునిచే ఆకర్షింపబడకున్నాడు నీటితో కడిగి శుభ్రపరచినఇనుముసూదంటు రాయిచే నాకర్షింపబడును అట్లే నరుని ఇహలోకములో నంటిపెట్టి యుండు మాయామలములను సంతాప వేదనచేవచ్చు, కన్నీటితో కడిగివేసిన యెడల మానవుడు భగవంతునిచే నాకర్షింపబడును. ఎట్లనగా పసిబిడ్డ రోదించి తల్లి మనసును కరిగించి తల్లి ఒడిచేరునట్లుగా ఉపాసన చేయాలి.

"భగవన్నామము స్మరించినంతనే కనులనుండి ఆనందభాష్పములు వెలువడునంత వరకూ మాత్రమే ఉపాసన అవశ్యకము". అని రామకృష్ణ పరమహంస ప్రబోధించినాడు.

శ్లో॥ త్వమేవమాతాచ పితాత్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖాత్వమేవ
త్వమేవ విద్యాద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమదేవ దేవ ॥శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము॥

కలియుగమున "శ్రీవేంకటేశ్వరుడు" విశ్వకర్మగా స్తుతింపబడుచున్నాడు దేవుడు అను పదము ఆయనకు సార్థకమైనది ఆదికాలమున ఆయన దేవి రూపమున పూజలందుకొన్నాడనియు తరువాత కాలమున ఈశ్వరుడుగా సేవలందినాడనియు శ్రీమద్రామానుజాచార్యుల వారి కాలమున ఆయన శ్రీవేంకటేశ్వరునిగా మార్పుచెంది అర్చించబడు చున్నాడనునానుడి కలదు. దేవునికి నామ రూప లింగ భేదములు లేవు ఉండవను వేదవచనములు ఇచ్చట సార్థకమైనది. కనుకనే శ్రీనివాసుడు కుల,మత,ప్రాంతీయ భేదములు లేక సర్వజనులచే పూజలందు కొనుచున్నాడు. ఆస్వామి సాకారమున నున్న విశ్వకర్మ. శ్రీ వేంకటేశ్వరుడు భక్తులపాలిట కల్పవృక్షము. మోక్ష ప్రదాత.

# విశ్వకర్మ

విశ్వకర్మ అనగా విశ్వాని=సర్వాణి-(సృష్టి స్థితిలయా దీని) కర్మాణి యస్యసౌ విశ్వకర్మణః అనునది విశ్వకర్మ పదమునకు వ్యుత్పత్త్యర్థము.

ఈచరాచర జగత్తు ఏదేవుని వలన సృష్టింపబడినది. ఈసృష్టి అంతయు ఎవ్వనిలో ఇమిడియున్నది? తుదకు ఎవ్వనిలో కలిసిపోవుచున్నది? అసలు ఈసమస్త సృష్టికి రక్షకుడెవరు? సృష్టికి మూలకారణమెవరు? చావు, పుట్టుకలతో కూడిన సంసార చక్రమందు తిరుగాడని అక్షర పరబ్రహ్మము ఎవరు? విశ్వమే తానైన ఈశ్వరుడెవరు? తనకు తానుగా పుట్టగల పరమాత్మ ఎవ్వరనెడి ఆలోచన, జ్ఞాన జీవియైన మానవునికి కలుగకమానదు. ముల్లోకములును వాటిని పరిపాలించిన వారును పరిపాలింపబడెడి సమస్త జగత్తును నశించిన పిదప ఏర్పడెడి పెంజీకటి కవతల పరంజ్యోతి స్వరూపుడై వెలుగు అక్షర పరబ్రహ్మ స్వరూపవేదియనెడి సందేహము కలుగక మానదు. ఇందుకు సమాధానము "మూల స్తంభము" అనెడి గ్రంధమందు ఇట్లు వ్రాయబడియున్నది.

**నభూమిర్న జలంచైవనతేజోనచవాయవ:**

**నచబ్రహ్మా, నవిష్ణుశ్చ, నరుద్రో, నచతారకా:**

**సర్వశూన్యే విశ్వకర్మా స్వయంభూరభవత్తదా...**

అనగా ఈ భూమి నీరు, వెలుతురు, గాలియు లేనప్పడు, బ్రహ్మ విష్ణువు, రుద్రుడు నక్షత్ర తారకలు లేని సమయమున ఏ ఆధారము లేకయే " విశ్వకర్మ భగావానుడు" అనెడి దేవాది దేవుడు తనంతే తానుగా అవతరించినాడు.

**శ్లో॥ అజాయత జగత్సర్వం, సృష్ట్యాదౌ విశ్వకర్మణ:**

**సఏవకర్తా విశ్వస్య, విశ్వకర్మా జగత్పతి: ॥వి.పు॥**

సృష్టికి మొదట విశ్వకర్మ నుండియే జగమంతయు పుట్టినది.

కనుక అతడే కర్త ప్రభువు.

**మూలస్తంభము:-** సంస్కృత భాషలో "మూలస్తంభ" మనునొక పురాణము విశ్వకర్మ మహిమలను తత్సంతానము యొక్క విధులను వివరించునది కలదు. దీని పరిశుద్ధ ప్రతి జర్మనీదేశములోని ఓరియంటల్ లైబ్రరీ లోవున్నదని శ్రీ బి.జి.సరస్వతీస్వాముల వారు వ్రాసియున్నారు

**విశ్వకర్మ పురాణము:-** సంస్కృత భాషలో విశ్వకర్మ పురాణమనునొక గ్రంథముఉన్నదనియు తద్గ్రంథ సంఖ్యాదికమును గూర్చి నాగర ఖండము ఇట్లు చెప్పచున్నది. విశ్వకర్మ పురాణము పది రెండులక్షల పదమూడు వేల శ్లోకములుకలవనియు తెలియునున్నది. ఈవిశ్వకర్మ పురాణము మొదలుకొని సర్వపురాణములును ఆవిశ్వకర్మ శరీరమునుండియే పుట్టినవనియు "నాగరఖండ" మనుచున్నది. విశ్వకర్మ ఏయే అవయవములందు ఏయే పురాణములు పుట్టినదియు నాగర ఖండములోనే వర్ణింపబడియున్నది. జగత్కారణుడైన విశ్వకర్మతత్వము, వేదములలో పెక్కుతావుల వర్ణింపబడినది. అందు మొదటగా ఋగ్వేద దశమమండలమున 81,82 సూక్తములలోను, కృష్ణ యజుర్వేద తైత్తరీయ సంహితయందు చతుర్ధ కాండ షష్ఠ ప్రపాఠకమునందును, శుక్లయజుర్వేదమునందును విశ్వకర్మను గూర్చిన వివరములు గలవు. అందు విశ్వకర్మ నామక అఖండ శక్తి బ్రహ్మాండముల సృష్టి స్థితి లయాదులకు మూల భూతమైన దనియు దానిని అజ్ఞాను లెఱుంగ లేక యున్నారనియు దాని నెఱంగిననే జీవులకు అమృతతత్వము సిద్ధి ంచు ననియు చెప్పబడినది. ఈ విశ్వకర్మ తత్వమే పురుషసూక్తమునందును వివరింపబడినది. వేదములన్నింటను అటనట విశ్వకర్మను గూర్చిన ప్రశంసలను కాంచగలము.

"సృష్టికి హేతు భూతమైన అఖండ పరమాత్మ స్వరూపమే దేవుడు" అతనినే "విశ్వకర్మ" అని ఋగ్వేదము పేర్కొనినది. అతడు తన మహిమ చేత ద్యావాపృథువులను సృష్టించినాడు. జీవుల కర్మ బంధములను తొలగించి మోక్షము నీయగల మహా శక్తి వంతుడాతడు. ఆ ప్రభువు జీవుల సృష్టికి ముందే వాటి పూర్వ జన్మ కర్మలనుసరించి వాటికి అనుభవ యోగ్యమైన జగత్తని యెడి భోగ్యపదార్థములను ముందుగనే సృష్టించియున్నాడు.

నిమిత్తోపానములు రెండును తానెయై విశ్వకర్మ భగవానుడు సృష్టించి వాటియందె ఆత్మరూపమున ప్రవేశించియున్నాడు. దివ్య జ్ఞానమునతని నెఱంగిన వారికి మోక్ష సుఖమునొసంగగల మహిమాన్వితుడా ప్రభువు. విశ్వకర్మ అనగా ఒక్క కులమునకు చెందిన వాడుకాదు. ఒక మతము వాడు కాదు. ఒక దేశమువాడు కాదు ఆయన సమస్తలోకములను సృష్టిచేసిన వాడు. సమస్త వేద శాస్త్రములు ఆయన నుండి పుట్టినవే అందుచే అయనను "వాచస్పతి" అన్నది దివ్యవేదము, ఆయన నిరాకారుడు కాలరాత్రి కల్పమును అతడే కావున ఆయన కాల పురుషుడు, మానవునికి కాలము చాలా విలువైనది, కాలము క్షరమైనది. దేవుడు అక్షరమైనవాడు అట్టి పరమపితను గూర్చి తెలిసికొనుటలో ఎంతయో ఆనందంగలదు.

**శ్లో॥ వేద శాస్త్రేతి హాసేషు॥ పురాణేషుచ సర్వతః**
**విశ్వకర్మ జగద్ధేతు, రితి రాజేంద్ర కథ్యతే ॥వి॥క. పురాణం॥**

వేదములయందును శాస్త్రములయందును. ఇతిహాస పురాణాది సమస్త వాఙ్మయమునందును విశ్వకర్మయే, జగత్తుల ఉత్పత్తి స్థితిలయాది కర్మలకు హేతువని చెప్పబడుచున్నది.

విశ్వకర్మ అనగానే పురాణాలు మాత్రమే చదివిన మనకు ఏ దేవశిల్పిగానో, మానవశిల్పిగానో తోస్తుంటాడు. విశ్వకర్మ ప్రభావము అంతమాత్రమే కాదు.మనమనుకున్న విశ్వసంతతికంతటకి అతడే కారణభూతుడు. జగత్పిత మనలను కన్న తండ్రి. మనమేటి మనుకొన్న పృథివ్యన్తరిక్ష , దశమ లోకాలకు స్రష్ట అతడే. ఇలాంటి విశ్వపితను పురుషోత్తముని మనం మరిచినాము. అలాగే గాయత్రీ మాతను కూడా మరిచిపోయినాము. ఈ ఇద్దరు ప్రకృతి పురుష స్వరూపులనే సంగతినికూడ మరిచినాము. ఇలాంటి వీరితత్వాన్ని తైత్తరీయ సంహిత ప్రత్యేకంగా నిరూపించినది.
( "విశ్వకర్మ"ను గూర్చి వివరంగా తెలుసుకొనగోరు వారు నా మొదటి రచన "విశ్వకర్మ భగవానుడు" అను గ్రంథమును చూడగలరు. )



## కర్మ

**విశ్వకర్మోద్భవం కర్మ, కర్మోద్భవం వేదం**

**వేదోద్భవం జ్ఞానం జ్ఞానాత్కైవల్యమాప్నోతి ॥** ॥చిన్మయాచార్య విశ్వకర్మ॥

హిందూమతమున కర్మ సిద్ధాంతము మిక్కిలి ప్రధానము.

ప్రపంచమున గానవచ్చు హెచ్చు తక్కువలను తరతమ భేదములకు కర్మసిద్ధాంతము మాత్రమే సరియగు సమాధానము నీయగల్గియున్నది. పుట్టిన జీవులందరు ఒకే విధముగా ఎందుకు లేరు? కొందరు సుఖమును, మరికొందరు దుఃఖమును ఎందుకు అనుభవించుచున్నారు? ఇట్టి గడ్డు సమస్యలను కర్మ సిద్ధాంత మొక్కటే పరిష్కరింపగలదు. కారణములేక కార్యముండదు అను విషయంపై కర్మసిద్ధాంతము ఆధారపడియున్నది. జీవులలో అనుభవించు సుఖమునకైనను దుఃఖమునకైనను వారు పూర్వమాచరించిన కర్మలే కారణము.

సుకృతమొనర్చినవాడు సుఖమును దుష్కృతముచేసినవాడు దుఃఖమును పొందితీరును. ఏబీజమును నాటెదవో ఆఫలమునే అనుభవింతుముగదా!అట్లే ఎట్టి కర్మచేయుదుమో అట్టి ఫలమునే అనుభవింతుమని కర్మ సిద్ధాంతము చాటు చున్నది.

గతజన్మలో చేసిన కర్మగూడ ఈజన్మలో ఫలించుచుండును అట్లే ఈజన్మలోచేసినకర్మలురాబోవు జన్మలోఅనుభవమునకువచ్చుటయుగలదు.

ఆరోగ్యము, దీర్ఘజీవితము, సంపద, కీర్తి అధికారము మున్నగునవి పుణ్యకర్మలచే గల్గు ఫలములు. రోగము, అకాలమరణము, దారిద్ర్యం మున్నగుదుష్ఫలములన్నియు పాపకర్మలచే గల్గుచుండును. జ్ఞానోదయ మగునంత వరకూ ఈకర్మ ఫలములు నీడవలె జీవులను వెన్నాడుచునేయుండును. "జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణి భస్మసాత్కురుతే తథా" అని గీత చెప్పినట్లు జ్ఞానమనెడి వహ్ని సమస్త కర్మలను దహించుచున్నది. జ్ఞానవంతులై భగవత్సన్నిధి జేరిన ముక్త జీవులకిక కర్మతో ఎట్టి సంపర్కములేదు ఇది విశ్వకర్మోద్భవముకావున జగచ్ఛిల్పి విశ్వకర్మభగవానుడు జగద్గురువైనాడు.

## మతము

మతమనునది మానవుని జీవనమార్గము. దీనిగమ్యము స్వర్గమును చేరుట దీనియందు మానవుని సంస్కృతి, సంప్రదాయములు కాంచనగును.

అఖండ భారతదేశము, ఉపఖండమని పేరుగాంచినది. ఇది ఒక ద్వీపకల్పము. దీనికి మూడువైపులా సముద్రములు ఉత్తరమున హిమాలయ పర్వతములుగలవు. వాయవ్యభాగమున మాత్రము ఇతర ఖండవాసులు కనుమలమార్గమున ఇందు ప్రవేశించువీలుగలదు. అవిఖైబరు, బోలాన్ అనెడి పర్వత శ్రేణులలోని కనుమ మార్గములు. ప్రాంతమున సింధునది అనెడి పెద్దనది. ప్రవహించుచున్నది. సింధుదేశమని పేరు కలిగినది. రానురాను ఆ పదము హిందుదేశముగ మారినది. హిందుదేశములోని ప్రజల సంస్కృతిని సాంప్రదాయమును హిందూమతముగా పిలిచిరి. ఇది అతి ప్రాచీనమైనది. ప్రపంచములలో మొదటి దని చెప్పవచ్చు ఇది సనాతన ధర్మమని వ్యవహరింపబడుతున్నది. దీనికి దివ్యవేదము ఆధారము. కనుక హిందువుల మతగ్రంథము దివ్యవేదము! అన్ని మత సాంప్రదాయములను యిముడ్చుకొనగలుగు అవగాహన శక్తి గలదు. ఎందరో విదేశీయులు తమ మతములలోని హిందువులను మార్చి వేయాలనుకొన్నారు. కాని అది వీలు పడలేదు. ఏమతమునైనా గౌరవించి అందరికి దేవుడొక్కడే, అందరిలోను ఆదేవుడు అంతర్యామిగా ఉన్నాడు. అను తత్వజ్ఞానముతో అన్ని మతములనుగౌరవించి తమలో యిముడ్చు కొనగలుగు మత సహనము అవగాహన హిందువులకున్నది. ఏమతమైనా భగవంతుని చేపట్టుటకు మతము మార్చుకొనవలసిన అవసరములేదు. మతములెన్నియైనా మానత్వమొక్కటే అని తెలిసికొంటే చాలును.

మతము మార్చుకొనుట ఆత్మహత్యతో సమానమని "స్వామి వివేకానంద" చెప్పియున్నాడు.

**ఆ॥వె, మతము మార్చుటన్న అతిపాపమిలలోన**

**గాంధి చెప్పినట్లు గట్టిగాను.**

**మతములేనివాడు మహిలో నెకనరాడు**

**రామ శాస్త్రి మాట రాచబాట.(రాచబాట శతకము నుండి)**

# దివ్యవేదము

## (పంచ వేదములు)

విశ్వకర్మోద్భవం కర్మ, కర్మోద్భవం దివ్యవేదం

దివ్యవేదోద్భవం జ్ఞానం, జ్ఞానాత్మైవల్యసంప్రాప్తిః ॥ ॥చిన్మయాచార్య విశ్వకర్మ॥

విశ్వకర్మవలన కర్మ, అకర్మవలన పంచవేదములు, ఆవేదముల వలన జ్ఞానము, ఆదివ్యజ్ఞానమువలన మోక్షము లభించును.

అట్టి జ్ఞానము నిచ్చునదే దివ్యవేదము. ప్రపంచములోని మతములలో హిందుమతము మిక్కిలి ప్రాచీనమైనది. ఇది సనాతన ధర్మమను పేరుతో వ్యవహరింప బడుచున్నది. హిందు ధర్మమునకు ద్వివవేదము ఆధారము. అట్టి దివ్యవేదముదేవుని గూర్చియు ఆయన సంతానమును గూర్చియు జగన్నిర్మాణమును గూర్చి యు సమస్తమును తెలియజేయుచున్నది. వేదమనగా తెలుపునది అని అర్థము. ఋగాది వేదములకు దిక్కుమూలము, జనకుడు, శరణము లేక ఆశ్రయము అయినవాడు విశ్వకర్మభగవానుడు. పంచాననుడైన ఆవిశ్వకర్మ అయిదు ముఖముల నుండి ఋగ్వేదము యజుర్వేదము. సామవేదము, అధర్వణ వేదము ప్రణవ వేదము అనునైదు వేదములు ఉద్భవించినవి.

"ఋచ స్సామాని జాజ్ఞిరే, ఛందాగుంసి జజ్ఞిరే తస్మాత్ యజుస్తస్మాదజాయత"

అని దివ్యవేదము పురుష సూక్తమున తెలుపుచున్నది. జగత్కారణమైన పరమపురుషుని నుండియే వేదములు కలిగినవని దివ్యవేదమే చెప్పుచున్నది. బృహదారణ్యకము కూడ వేదము పరబ్రహ్మము యొక్క నిఃశ్వతమని యే చెప్పుచున్నది. ఋషులు దివ్యవేద సూక్తములకు ద్రష్టలై ఆనాటి భాషలో ఆయా చందస్సులతో మంత్రములు కూర్చినను తాత్వికభావములు మాత్రము శాశ్వతుడైన విశ్వకర్మ పరమేశ్వరుని నుండి వచ్చినవే కాగా వేదములకు దిక్కు, జనకుడు అయినవాడు భగవంతుడు లేక బ్రహ్మము అందుకే అతనిని 'వాచస్పతి' అనియు అనినారు.

**వాచస్పతిం విశ్వకర్మాణ మూతమే మనోజవం వాచే అద్యాహువేమ**

**సనో విశ్వాని హవనాని జోషద్విశం భూ శవసే సాధుకర్మా॥** ఋ. స్తూ. 81 మం.7

**భావము :-** మంత్ర రూపమున వాక్కునకు పతియైన అనగా బ్రాహ్మణ స్పతియు బృహస్పతియు అయిన విశ్వకర్తను మనోవేగమువంటి గమనముగల వానిని యజ్ఞమునందు ఈనాడు పూజార్థమై పిలుచు చున్నాము విశ్వమునకు సుఖము నిచ్చువాడును, మంచికార్యములు కలవాడును నగు ఆ దేవుడు మాయొక్క సర్వములైన పూజలను మారక్షణకోసము అందుకొనుగాక :

**"ఋగ్వేదశ్చ మనూనాంచ, మయూనాంచ యజుశ్రుతిః**

**త్వష్టానాం సామవేదశ్చ, శిల్పినాం త్వధర్వకః ॥** నాగరంఖండము ॥

అనగా మనువంశము వారు ఋగ్వేదమును, మయ సంభూతులు యజుర్వేదమును, త్వష్ట వంశములు సామవేదమును, శిల్పి వంశమువారు, అధర్వణ వేదమును, విశ్వజ్ఞ వంశము వారు ప్రణవ వేదమును చదువ వలయునని తెలుపబడినది.

పరబ్రహ్మ పంచ శీర్షుడై విశ్వకర్మగా నున్నప్పడు అయిదువేదములును, ఆయన చతుర్ముఖబ్రహ్మ అయినప్పడు నాలుగు వేదములని పురాణకాలమున ప్రచారమైనవి.

వేదములు, స్మృతులు, పురాణములు, మొదలైన గ్రంథములవలె ఋషులచేరచింపబడినవి కావు. శాశ్వతములైన ఆధ్యాత్మిక సత్యములను ప్రతిపాదించిన వేదములు భగవద్వచనములనుటకు ఎట్టి సందేహము లేదు. కావుననే ఇతర మతములకు వలె ఈమతమునకు ప్రవక్త అనగదగిన మూల పురుషుడెవ్వడును లేడు. పరమపురుషుడు, పురుషోత్తముడు అయిన విశ్వకర్మ నుండి (దివ్యవేదము) పంచ వేదములు పుట్టినవి. పంచబ్రహ్మలు దివ్యవేదమునకు ప్రవక్తలు. హిందువుల మతగ్రంథము దివ్యవేదము. పంచమ వేదమైన ప్రణవవేదమును గూర్చి ఎవ్వరికిని తెలియరాలేదు. చతుర్వేదములసారమేప్రణవ వేదమని కొందరు, నాద బ్రహ్మ స్వరూపమైన ఓంకారము ప్రణవము దానినుండియే మిగతా వేదములు పుట్టినవని కొందరు అభిప్రాయపడుచున్నారు. దీనిని గూర్చి వ్యాసుడు తన గురువు వద్దనుండి గ్రహించ లేదేమోనని పించుచున్నది. ఈ విషయమును గూర్చి పండితులు పరిశోధనలు చేయుట అవసరమనియు "దర్శనాచార్య" కొండూరు వీరాఘవాచార్యులు గారే తమ అభిప్రాయమును వెలిబుచ్చియున్నారు.

దివ్య వేదమనగా వ్యాసుల వారు వేదవిభజన చేయుటకు ముందు ఉన్నవేదము. పంచవేదములను విశ్వకర్మ వంశజులు అనువంశికముగా చదువుచు వచ్చిరని పైన పేర్కొనడమైనది. "ద్వాదశ మహర్షులలో ఒకడైన వ్యాసుడు విశ్వకర్మ వంశోద్భవుడైన మరియొక విశ్వకర్మను ఆశ్రయించి సమస్త విద్యలను చదువు కొన్నాడు. గురువు తాలూకు కొన్ని వేదశాస్త్రములతో కాశీపురము చేరుకొని బ్రహ్మత్వానికై త్రిమూర్తులను గూర్చి తపస్సు చేసాడు. ఎంతటి దురాలోచన కలిగియుంటివని వారు మందలించారు. నేనేమి తప్పు చేయడములేదుగదా నన్నేల దూషించెదరని వాపోవగా వాని ఆర్తికి కరుణించిన ఆత్రిమూర్తులలో మనుబ్రహ్మ యజ్ఞోపవీతమును,మయబ్రహ్మ దండకమండలముల నివ్వగా, త్వష్టబ్రహ్మ దివ్యజ్ఞానమంత్రోపదేము చేసెను. వ్యాసుడు తనగురువు వద్ద నుండి తెచ్చిన గ్రంథములు ననుసరించి తన యిష్టం వచ్చి నట్లు చేర్పులు మార్పులతో పంచవేదములను చతుర్వేదములుగాను అష్టాదశ పురాణములను వ్రాసి బోధించెనని తెలియుచున్నది. ఈయన చేసిన మార్పులలో పంచముఖ బ్రహ్మను చతుర్ముఖ బ్రహ్మ అనియు పంచ మూర్తులను త్రిమూర్తులనియు, పంచవర్ణముల వారిని అష్టాదశ వర్ణములు అనియు పేర్కొనుట జరిగినది.

విరాట్ పురుషడైన విశ్వకర్మ అవయవాంగములనుండి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, పంచములు ఉద్భవించినట్లు శృతులు వెల్లడిస్తున్నాయి." ఈవిషయమును బహుగ్రంథకర్త బ్రహ్మశ్రీ పి. బి. వీరాచార్యులు గారి వ్యాసుని ఉందంతము అను శీర్షిక నుండి గ్రహించ డమైనది.

వేదములు చెప్పిన విషయములనే స్మృతులు, ఇతి హాసములు పురాణములు మొదలగునవి పలురీతుల విశదీకరించుచున్నవి. వేదములందు నాలుగు భాగములుండును.

**1. మంత్ర భాగము :-** ఇందు ప్రకృతిని ప్రకృతిశక్తులను వాటి సౌందర్యమును అనగా దేవతలను బడు ప్రకృతి శక్తులు యొక్క నామ, రూప, గుణ విశేషములను వాటి ఆరాధించే సూక్తములు ఆకర్షణీయమైన ఛందోరూపముతో గూడియుండును.

**2. బ్రహ్మణము :-** ఇందు కర్మకాండ యజ్ఞయాగాది విధులు వాటి నాచరించు విధానము వర్ణింప బడియుండును.

**3. ఆరణ్యకములు :-** ఈ సర్వ విధములగు ఉపాసనా మార్గములం వివరింపబడియుండును.

**4. ఉపనిషత్తులు :-** ఇందు వేదసారము గురుశిష్యుల సంవాద రూపమున పరమాత్మ స్థితికి చేర్చును. అనగా మోక్షమార్గమును తెలియ జేయుచున్నది. ఉపనిషత్తులనే వేదాంతమందరు. హిందూ మంతములోని మహోన్నత సిద్ధాంతములు ఉననిషత్తులందే కలవు. బ్రహ్మజ్ఞానమునకు అనువైన ఉపాయములిందు వివరింపబడినవి. అందుచేతనే ఉపనిష ద్విద్యను బ్రహ్మవిద్యఅనియు అధ్యాత్మ విద్య అనియు వ్యవహారింతురు. దీనినే పరమాత్మ జ్ఞానమనియు పరంజ్ఞానమనియుగూడ అందురు.

**శ్లో॥ సర్వోత్కృష్టం పరం జ్ఞానం జ్ఞానం త్రైలోక్య దుర్లభమ్।**
**తస్మాత్ సర్వప్రయత్నేన జ్ఞానమే వహి సాధయేత్॥** - వి. క. పు

పరమాత్మ విషయకమైన జ్ఞానము సర్వప్రపంచమున కంటెను శ్రేష్ఠమైనది. ఇది ముజ్జగముల యందును దుర్లభమైనట్టిది. కావున మానవుడెల్ల ప్రయత్నములుచేతను జ్ఞానమునే సాధించవలయును.

వేదములు మోక్షమే పరమపురుషార్థమని వక్కాణించు చున్నవి. చతుర్విధ పురుషార్థముల ందలి ధర్మ, అర్థ, కామ, మోక్షము లనెడి నాల్గింటిలోను మొదటి మూడును. నాల్గవది యైన మోక్షమునకు సాధనములుగా చేసుకొన్నప్పడే మానవజీవితము సార్థకమగును. కాని మానవుడు ధనేషణ, దారేషణ, పుత్రేషణ అనెడి ఈషణ త్రయములలో తగుల్కొని మానవజన్మ సార్థకతను సాధించలేక పోవుచున్నాడు.

# చతుర్విధ పురుషార్థములు

ఆహారము నిద్రమొదలగు విషయములలో మానవులకును ఇతర ప్రాణులకును భేదములేదు. వివేకమొక్కటే ఇతర జంతువులనుండి మానవులను వేరు చేయుచున్నది. వివేకములేని మానవుడు ద్విపాద పశువే మానవుడు తాను ఈ లోకములో ఏల జన్మించెను? ఈ జీవితమున ఏమి సాధింపవలెను? అని తప్పక ఆలోచింపవలెను. అట్లు ఆలోచించియే పూర్వము మన పెద్దలు మానవుడు చతుర్విధ పురుషార్థములను సాధింపవలెనని చెప్పిరి. ధర్మము, అర్థము, కామము, మోక్షము, అనునవి యే చతుర్విధపురుషార్థములు. వానిలో నాల్గవదియైన మెక్షము ముఖ్యాతి ముఖ్యమైనది. ధర్మార్థకామములు ముక్తికి సాధనములైనప్పడే చరితార్థములగునని శాస్త్రములు చెప్పచున్నవి.

**1. ధర్మము :-** చతుర్విధ పురుషార్థములందు మొదటిది ధర్మము. "ధారణాద్ధరః" అను వ్యుత్పత్తిని బట్టి లోకమును ధరించునదే ధర్మమని గ్రహింపవలెను. మానవుడు దిగజారి పోకుండ పైకెత్తి కాపాడునదే ధర్మము. నిత్యము ధర్మములను ష్టించువాని సందేహ సమయములలోధర్మము స్ఫురించును.

ప్రతి వ్యక్తియు తన జీవితములో పాటింప వలసిన కొన్ని ధర్మములు గలవు. అవి పాటింపనిచో లోక వ్యవస్థతారుమారగును. అ ధర్మమువ్యాపించిన ప్రదేశములో జీవితము సుఖముగా నుండదు. "ధర్మోరక్షతి రక్షితః" ధర్మమును మనముకాపడినచో అది మనలను కాపాడును. అంత ప్రధానమైనది కావుననే ధర్మమునకు హాని కలిగినప్పడు భగవంతుడు దానిని స్థాపించుటకు తానవతరింతునని చెప్పెను. " యధా[illegible]దాహి ధర్మస్య గ్లా నిర్భవతి భారత" అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్

సత్యమును పాటించుట, పెద్దలను గౌరవించుట, పరోపకార మొనర్చుట, ప్రాణుల యెడదయ చూపుట, శీలము గలిగియుండుట మున్నగు ధర్మము లెన్నో గలవు. వీనిని పాటింపకుండుట అధర్మమునకు హేతువై పాపముదయించును. రామాయణము, భారతము మొదలగు గ్రంథములలో శ్రీరాముడు, ధర్మరాజు మొదలగు వారు ధర్మాత్ములుగా వర్ణింపబడిరి. వారివలె ధర్మమునుపాటింప వలెనని ఆ గ్రంథములు మనకు బోధించు చున్నవి.

ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియముతన మనంబున కగుదా
నొరులకునవి చేయకునికి
పరాయణము పరమ ధర్మ పథముల కెల్లన్. ॥ఆంధ్ర మహాభారతము॥

**2. అర్థము :-** అర్థ మనగా ధనమని యర్థము. ఇది రెండవ పురుషార్థము "ధనమూలమిదం జగత్" అన్నట్లు జగమంతయు ధనముపై ఆధారపడి యున్నది. ధనములేనిచో ఎట్టి కార్యమును సాధింపజాలము. అట్లని అధర్మ మార్గములతో ధనార్జనకు ప్రయత్నింపరాదు. అట్లొనర్చుట పాపకారణమగును. ఆర్జించినధనమును సద్వినియోగ పర్చవలెను. ధర్మ కార్యములకై ధనమును హెచ్చింపవలయును. కాళిదాసు రఘువంశపు రాజులను వర్ణించుచు "త్యాగాయ సంభృతార్థానాం" అని చెప్పెను. అనగా వారుత్యాగము చేయుటకే ధనమునార్జించు చుండిరని భావము. ధనము సదుపయోగము చేయకకూడ బెట్టు లోభి అధార్మికుడై పాపము మూటగట్టు కొనును.

**భూమి నాదియన్న పుడమి పక్కున నవ్వు**

**దానహీనుజూచి ధనము నవ్వు**

**కదనభీతుజూచి కాలుండునవ్వురా**

**విశ్వదాభిరామ వినురవేమ.**

**3. కామము :-** కామమనగా కోరిక అని అర్థము. జీవితములో ప్రతివానికి ఎన్నోకోరికలుండును. వానిన తీర్చుకొనుట కూడ పురుషార్థమే కాని ఆ కోరికలు ధర్మ విరుద్ధములై యుండరాదు. ప్రాణులలో ధర్మమునకు విరుద్ధముగాని కోరిక తన స్వరూపమేయని గీతలో భగవంతుడు చెప్పియున్నాడు.

"ధర్మ విరుద్ధః కామోస్మి, భూతేషు భరత ర్షభ!"

ధనము నార్జించుటలో గూడ ధర్మము నతిక్రమించరాదు. ఎన్ని కట్టెలు వేసినను అగ్నికి తృప్తి లేనట్లు ఎన్ని సుఖము లను భవించినను మానవునకు తృప్తి కలుగదు. కావున క్షణికములగు ఐహిక సుఖముల మీద ఆశలను పరిమితిలో నుంచుకొని వివేకవ ంతుడు శాశ్వత సుఖమునకై అనగా ముక్తికై ప్రయత్నించును.

"మానవుని దుఃఖ ములకు కోరికలే మూలకారణము"

**అని గౌతమ బుద్ధుడు తెలిపియున్నాడు.**

4. మోక్షము :- మోక్షమనగా విడుదల అని అర్థము అనాదికాలమునుండి మానవుడు అవిద్యలో మునిగి సంసార బంధములో తగుల్కొని యున్నాడు. మాటి మాటికి చావు పుట్టుకలకు లోనగుచు మితిలేని దుఃఖమునకు భవించుచున్నాడు. ఈ దుస్థితినుండి తప్పించుకొని శాశ్వతమైన ఆనందస్థితి నందుకొనుటే మోక్షము. ఆ స్థితిలోని ఆనంద మిట్టిదని మాటలలోచెప్పటకు వీలుగాదు. జీవులుకర్మ బద్ధులై సుఖదుఃఖము లను అనుభించుచున్నారు. విహిత కర్మలను భగవత్ప్రీతికొరకు నిర్వహించువారు భగవదనుగ్రమునకు పాత్రులై యోగమార్గమున మోక్షము నొందుదురు.

ముక్తులైన వారికి సుఖ దుఃఖములు లేవని న్యాయవైశేషిక దర్శనములు సిద్దాంతీకరించు చున్నవి.

శ్లో॥ బ్రహ్మణ క్షత్రియో వైశ్యో శూద్రో చండాల ఏవచ।
దృఢాభ్యాసే కరోనిత్యం. పునర్జన్మ న విద్యతే॥

తా॥ బ్రాహ్మణ చండాలాంత మెవ్వరైనను భగవన్నిష్ఠ, దృఢాభ్యాసము సతతము జేసినట్లు లైన జన్మరాహిత్యము అగునని శ్రుతులు జెప్పచున్నవి.



## పంచ బ్రహ్మల పుట్టుక వారి కృత్యములు :

నభూమిర్నజలం చైవ, నతేజోనచ వాయవ :
నచ బ్రహ్మాన విష్ణుశ్చ, నరుద్రో నచ తారకా :
సర్వశూన్యే విశ్వకర్మా స్వయం భూరభ వత్తదా . ॥ మూలస్తంభము ॥

ఈ భూమి, నీరు, అగ్ని, వాయువు, నక్షత్రములు లేనప్పుడు బ్రహ్మ, విష్ణు, రుద్రాది దేవతలు కూడా లేనప్పుడును అసలు ఏమియు లేని ఒకానొక నిరాలంబన సమయమందు విశ్వకర్మ భగవానుడు సృష్టికి మొట్టమెదటగా ఆవిర్భవించి పరంజ్యోతి వలె ప్రకాశించినాడు.

సద్యోజాత ముఖేజాతస్సానగో విశ్వకర్మణ :
వామదేవ ముఖేజాతో బ్రహ్మర్షిస్తు సనాతన :
అఘోరముఖే జాతోహభూనో విశ్వకర్మణ :
తత్పురుషముఖేజాత : ప్రత్నసా విశ్వకర్మణ :
తస్సేశానముఖే జాతస్సుపర్ణో విశ్వకర్మణ : ॥ తై. ఉ. ॥

మనుర్మయ స్తథా త్వష్టా శిల్పీ విశ్వజ్ఞ ఏవచ
విశ్వకర్మ సుతా హేతే పంచ సృష్టి ప్రవర్తకా : ॥ స్కా. పు. నాగరఖండం ॥

సుపర్ణ స్సానగశ్చైవ సనాతన ఇతిస్మృతి :
గురుశ్రేష్ఠో హభూనశ్చ ప్రత్నో ధాత్రీ సురక్షక : ॥ వశిష్ట పురాణం ॥

తే॥గీ మనువుఉ శివుడును మయుడును మాధవుండు
త్వష్ట పరమేష్ఠి, శిల్పివృద్ధశ్రవుండు
తక్ష భానుండునగు వీరుదైవగురులు
విశ్వకర్మాగ్రనందనుల్ వినుతపుణ్య! ॥ ఆంధ్ర నాగరఖండం ॥

పాంచాననుడైన విశ్వకర్మ సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానమనెడి ఐదు ముఖములనుండి సానగ, సనాతన, అహభూన, ప్రత్న సుపర్ణులనెడి అయిదు తేజో కిరణములవంటి గోత్ర ఋషులు ఉద్భవించిరి. వారే మను, మయ, త్వష్ట,శిల్పి, విశ్వజ్ఞులనెడి విశ్వకర్మ పుత్రులుగా ప్రసిద్ధికెక్కిరి. వీరే శివుడు, విష్ణువు, బ్రహ్మా, ఇంద్ర, సూర్యులు. వీరు దేవతలకు ఆరాధ్యులై విలసిల్లిరి. విశ్వకర్మ కుమారులైన వీరు సృష్టి స్థితి, లయ, తిరోధాన అనుగ్రహాది కర్మలనాచరించెడి సృష్టి ప్రవర్తకులై భూమిని పరిపాలించిరి.

శ్లో ॥ **అయస్కృతిర్మనూనాంచ, మయానాందారుకర్మచ**

**త్వష్టూణాం తామ్ర కర్మణి శిలాకర్మచ శిల్పినామ్**

**సౌపర్ణం తక్షకానాంచ పంచకర్మాణి తానివై**

**ఏతే పంచక రూపాశ్చ యజ్ఞకర్మా పరాస్మృతా :** ॥ స్కా.పు. నాగరఖండం ॥

యజ్ఞకర్మలతో సమానమైన ఇనుము, కర్ర , రాతి, బంగారం, మొదలగు శిల్ప కళాకర్మలను మను, మయాది పంచబ్రహ్మలు ఆచరించినట్లు తెలియుచున్నది. నేటికిని తద్వంశేయులైన విశ్వకర్మ బ్రాహ్మణులు అయాదికర్మలనాచరించుచున్నారు.

ఆది కాలమున విశ్వకర్మ నామకశక్తి నిరాకారమై యుండెను. అట్టి నిరాకారశక్తి చేతనే ఈసాకార సృష్టి జరిగినది. పంచబ్రహ్మలు విశ్వకర్మ తత్త్వములో అంతర్భూతులే. అందుకే విశ్వకర్మకు సాకారము చెప్పవలసి వచ్చినప్పుడు పంచముఖములను కల్పించి ఆపాంచానన సంభవులు గానే మనుమయాది పంచబ్రహ్మలుగా చెప్పుట జరిగినది.

సృష్టికర్త అయిన విశ్వకర్మకు అయిదు ముఖములు గలవు వాటికి 1.)సద్యోజాతము 2.) వామదేవము 3.) అఘోరము 4.) తత్పురుషము 5.) ఈశాన ముఖములని పేర్లు గలవు. వాటికి శివుడు. మూర్తి, అమూర్తి, కర్త, కర్మ అను పేర్లు గూడ గలవు. ఆ జగత్కారకుడు జగత్తుల పుట్టింప గోరినవాడై తన దేహార్థము శక్తి (గాయత్రి) జగములను గలిగింపజాలిగ, సామర్థ్యమయుమన్న మాట ఆ శక్తి అయిదు రీతులునయి ఆదిశక్తి, మాయశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి, అను ఈ అయిదును మను శాఖారూపులైన పంచబ్రహ్మలతో గూడిన వారై నివసించు చుందురు.

మొదట విశ్వకర్మ అయిదు ముఖముల నుండి అయిదు కిరణములు ఉద్భవించినది. ఆ కిరణములే సానగ సనాతన, అహభూన, ప్రత్న సువర్ణులను, బ్రహ్మఋషులు. వీరిలో విశ్వకర్మ ప్రవేశించి పంచభూతములను సృష్టిగావించినాడు. వీరే పంచభూతములకు ప్రతీకలు. అధిదేవతలను వీరే తరువాత తరముల వారికి గోత్ర ఋషులైనారు.

1. మనువు 2. మయుడు 3. తృష్ట 4. శిల్పి 5. విశ్వజ్ఞుడు అనెడి పంచ బ్రహ్మలు విశ్వకర్మ భగవానుని కుమారులు వీరే పంచకర్మలు అనగా సృష్టి స్థితిలయ తిరోధాన అనుగ్రహములతో ఒప్పనట్టి సృష్టికి ప్రవర్తకులు. వీరినే పైన చెప్పబడిన విశ్వకర్మ భగవానుని పంచ ముఖములయిన శివుడు, మూర్తి, అమూర్తి, కర్త, కర్మ అనెడి పేర్లతో పిలుస్తారు. మరియు శివుడు, విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుడు, సూర్యుడు అని కూడ అంటారు. మను బ్రహ్మయే శివుడు, మయబ్రహ్మమే విష్ణువు, త్వష్ట బ్రహ్మయే బ్రహ్మ దేవుడు. శిల్పి బ్రహ్మయే ఇంద్రుడు, తక్ష బ్రహ్మయే సూర్యుడు. వీరు ప్రకృతి బద్ధ మానులై ఆయా యుగాలలో ఆయా పేర్లతో పిలువబడినారు. దేవతలకు కూడ ఆరాధ్యులయిన వీరు విశ్వకర్మ కుమారులని నాగరఖండమను గ్రంథముతెలుపుచున్నది.

# పదునెనిమిదియుగములు

విశ్వకర్మ నిరాకార శక్తి చేతనే ఈ విచిత్ర సాకార సృష్టి జరిగినది. ఒక్కొక్క మహాయుగమునందు విశ్వకర్మ భగవానుడు వేరువేరు ఆకారములను తాల్చిన వాడాయెను అట్లయిన ఆవిభుడు సర్వమును సృష్టించెను కృతయుగమున కంటెను ముందు విశ్వకర్మచే సృష్టించబడిన పదునాలుగు మహాయుగములు భిన్నరూపములై ప్రత్యేకముగా గడచిపోయినవి. చతుర్యుగములతో కలిపి పదునెనిమిది యుగములు అగును అవి 1. అనంతము 2. అద్భుతము 3. తమందము 4. తారకము 5. అండజము 6. భిన్నము 7. భిన్నాయత్తము 8. అభ్యాంతము 9. అనభ్యాంతము 10. అనీకరణము 11. మనీరణము 12. మన్వారణము 13. విశ్వారణము 14. విశ్వసృష్టి 15. కృతయుగము 16. త్రేతాయుగము 17. ద్వాపరయుగము 18. కలియుగము

## 1. అనంతము

మొదటిది అయిన అనంతయుగమున నాదబ్రహ్మ స్వరూపుడగు విశ్వకర్మ చేత ఓంకారయుక్తమగు గాయత్రీమంత్రము సృష్టింపబడినది. ఆ దేవయుగమునందు గాయత్రి నుండి సమస్తమైన దేవతలు, దేవఋషులు విశ్వకర్మచేత ప్రేరేపితులై జన్మించిరి. వారే సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సుపర్ణలనెడి ఆదిమఋషులు. వీరినే గోత్రఋషులు అంటారు. వీరినే విశ్వకర్మ భగవానుని అయిదు ముఖములనుండి ఉద్భవించిన మొదటి తేజోకిరణములని కూడా అందురు .

## 2. అద్భుతము

అద్భుతమగు ఆయుగమున జ్ఞానానంద రూపుడైన విశ్వకర్మచేత మొదటగా వేదములు, పర్వతములు పుట్టినవి. ఆమహాయుగమున సమస్తవేద సూక్తముల యందును, దేవతలు అనగా మనుమయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞ అనెడి పంచబ్రహ్మలు అనగా పంచభూత ప్రవర్తకులు, పంచభూత అధిదేవతలు విశ్వకర్మచేత సముద్భూతులైప్రవర్తించిరి

### 3. తమందము

తమందమను పేరుగల మహాయుగమున పరంజ్యోతి స్వరూపుడగు విశ్వకర్మచేత మొదట కపాలియను మహాశక్తి సృష్టింపబడినది."కపాలి" యను మహాశక్తి అనేసరికి వాడుకలోనున్న ఒక కధ జ్ఞప్తికి వచ్చినది. పూర్వము అనగా ఆదికాలమున కపాలి అనుదేవత భయంకరమైన రూపముకలిగి త్రినేత్రములతోను మెడలో కపాలములను మాలగా ధరించియును దండకమండములు కలిగి యుండెను. ఆమె కామవాంఛకలిగినదియై బ్రహ్మదేవుని పిలిచి తన వాంఛను తీర్చమనగా అతడు భయపడి అందులకంగీకరించడాయెను. పిమ్మట విష్ణువును పిలిచి అట్లే కోరగా అతడు కూడా తిరస్కరించగా వెంట వెంటనే వారిని ఆమె భస్మముగావించినది. తరువాత శివుని కోరగా అతడందుల అంగీకరించి ఆమెనుండి ప్రతిఫలముగా మూడవనేత్రమును, దండకమండలములను కోరినాడు ఆమె వాటిని శివునకు ఇచ్చి వేసినది. శివుడామెను సముద్రస్నానము చేసి శుచియై రమ్మని కోరినాడు. ఆమె తిరిగి వచ్చిన వెంటనే తనదైన మూడవ నేత్రమును తెరిచి ఆమెను భస్మముగావించినాడు. అప్పడు ఆ భస్మరాశిని రెండు భాగములు చేసి రెండవ భాగమును మరల రెండు భాగములు చేసి కమండలములోని జలముతో భస్మరాశులను సంప్రోక్షించి దండముతో వాటిని తాకి ముగ్గురు అమ్మలను తయారు చేసినాడు. బ్రహ్మ, విష్ణువులను అట్లే పునర్జీవింపజేసినాడు. మొదట స్త్రీమూర్తియైన ఆదిశక్తిని శివుడును, రెండవ స్త్రీమూర్తియగు పరాశక్తిని విష్ణువును, మూడవ స్త్రీమూర్తియగు ఇచ్ఛాశక్తిని బ్రహ్మయు వివాహమాడి సుఖించిరని పెద్దల చెప్పగా విన్నాను.ఆశక్తి యొక్క కపాలపు రక్తబిందువులచేత కలిగిన సమస్తదేవతలు విశ్వకర్మచేత రక్షితులైప్రవర్తించుచున్నారు.

### 4. తారకము

తారకమనెడి మహాయుగమున పరబ్రహ్మ స్వరూపుడైన విశ్వకర్మవలన పంచబ్రహ్మస్వరూపము కలిగినది. శివుడు, ఆమూర్తి, మూర్తి, కర్త, కర్మ, అనెడి బ్రహ్మలైదుగురు. విశ్వకర్మ వృక్షపు ఐదు శాఖలనుండి కలిగినారు. ఆయుగమందు దేవతాదులైన వారెల్లరు పంచబ్రహ్మలనుండి కలిగిన వారై విశ్వకర్మభగవానుని రక్షణచే ప్రకాశించుచుండిరి.

## 5. అండజము

అండజమను నాయుగమునందు దేవతాదులైన వారెల్లరూ పంచబ్రహ్మలనుండి కలిగిన వారై విశ్వకర్మ భగవానుని రక్షణచే ప్రకాశించుచుండిరి.

## 6. భిన్నజము

భిన్నజముఅను పేరు గల మహాయుగమున విరాడ్రూపుడైన విశ్వకర్మ స్వయముగా ఐదు ముఖములు, మూడు కన్నులు గల పరమశివుడై ప్రకాశించెను. ఆమహాయుగమున పరమశివుని నుండి ఏకాదశ రుద్రులు 1. హరుండు 2. బహురూపి 3. త్ర్యంబకుడు 4. అపరాజితుడు 5. వృషాకపి 6. శంభుడు 7. కపర్ది 8. రైవతుడు 9. మృగవ్యాధుడు 10. శర్వుడు 11. కపాలి అను పలువురు దేవతాదులు జన్మించినారు.

ఏకాదశ రుద్రులు అనగా తత్వార్థము జీవుల యందలి దశ ప్రాణములు, ఆత్మ కలిపి ఏకాదశ రుద్రులు అగుచున్నారు ఈ ప్రాణాత్మలు శరీరమునుండి లేచిపోయి ఏడుపింతురు గాన వీరిని రుద్రులని పిలుచుచున్నారు. "రోదయన్తీతి రుద్రాః" అని రుద్ర శబ్దమునకు వ్యుత్పత్తి అర్థము.

ద్వాదశాదిత్యులనగా పన్నెండు నెలలు ఇవి సర్వుల ఆయుసు తీసుకొని పోవును. గాన వీనిని ద్వాదశాదిత్యులని చెప్పబడుచున్నవి.

అష్టవసువులనగా 1. అగ్ని 2. పృథ్వి 3. వాయువు 4. అంతరిక్షము 5. ఆదిత్యుడు 6. ద్యుమలోకము 7. చంద్రుడు 8. నక్షత్రములు ఇవి సర్వమును వసింపజేయుచున్నందున వీటి వసువులన్నారు.

పరశివుడనగా లింగాకారమైన విశ్వకర్మ అవతారము గుర్తువస్తుంది. ఆవిరాడ్రూపుడైన విశ్వకర్మ సద్యోజాత ముఖమునందు ఆదిగృహసుడైన ఆమహాశివుడు ఉదయించినాడు. ఈ భౌతిక ప్రపంచరూపవమే అర్థనారీశ్వరుని నిజరూపము. ఆది శక్తి నుండి అణు శక్తి పుట్టినది. ఈ అణు శక్తి అనేబలములతో గడ్డకట్టి పదార్థమేర్పడినది

ఈ అణుశక్తిని దట్టించుటచే ఏర్పడిన ప్రతిపదార్థము శివుని దేహమే. కాని అట్టి పదార్థసృష్టికి మూలమై ఆపదార్థమందు సంపూర్ణంగా దట్టింపబడి అందు ఇమిడి దాగియున్న శక్తి ఒకటి యున్నది. ఇట్లు దట్టించుటకు కావలసిన సూక్ష్మశరీర రూపశక్తి ఒకటి. ఇంకనూ ఆపదార్థమును బయట అంటిపెట్టుకొని చుట్టియున్నది. అరూపశక్తి రూపమే పార్వతి ఆదిగృహిణి పెద్దముత్తయిదువ. అట్లు పార్వతి యను శక్తి శివుని బయటను లోపలను అదిమి పాలించుటచే మహేశ్వరుడు ఆమెకు స్వాధీన వల్లభుడు అయినాడు. ప్రత్యక్షముగా ఒక పదార్థరూపమున కనిపించు శక్తి రూపము శివుడు కనిపించక ఆపదార్థపు బయటను లోపలను ఆవరించియుండు శక్తి పార్వతి కనుకనే పార్వతి శివుని వామపార్శ్వమును అధిష్ఠించుకోగలిగినది.

ఈవిధముగ భౌతిక రూపమంతయు పార్వతి పరమేశ్వరుల ద్వంద్వ శక్తి రూప సమ్మేళనమే అర్థనారీశ్వర స్వరూపము. ప్రపంచమున పుట్టిన సమస్త ప్రమథాది భూతగణ కూట మంతయు మహేశ్వరుని సంతానమే. వినాయకుడు సుబ్రహ్మణ్యేశ్వరుడు వారి సంతానమే కాదా!

సర్వజీవకణములు సకలశరీరములు మహాశివాంశలే అగుచుండ అందలి వివిధ చలన శక్తులు పార్వతి దేవి అంశములేయగును. జీవుల శరీరమందలి దాగియున్న ప్రజ్ఞాన ఘనశక్తియు ఆమె మహా అంశమే. భౌతిక ప్రపంచమును శరీరమును కాపాడు ఉదార చరిత్రుడు. కావున ఆయన పశుపతిగ ప్రసిద్ధికెక్కినాడు. భౌతికముగా, సుఖప్రదాతగా భక్తాభీష్ట ఫల ప్రదాతగా ఆయన శంభుడు అయినాడు.

మహద్విశేషమేమన సృష్టిపరిణామ పరిపూర్ణతలో ఆకర్షణ, వికర్షణ అను శక్తులు విడివడి జీవకోటిలో స్త్రీ, పురుష రూపములు దాల్చినవి. ఆ ప్రతేక రూపములలో ను దేహము శివాంశ జీవాత్మ శక్త్యంశ ఇట్టి స్త్రీ, పురుష దేహములు మహాకర్షణ శక్తికి లో నై ఒక దాని కొకటి గాఢ ఆలింగనాది బంధములకు లొంగి కూడును.

ఇవి రెండు వేరు వేరు అయస్కాంతముల ఉత్తర దక్షిణ ధృవములు. అవి ఆకర్షణములచే శక్తినిగూడి ఒకే అయస్కాంతశక్తిగా ఏకమై నిలుచునట్లు భార్యాభర్తలు జీవితమును నేర్చ మలచవలెను. ఈ లింగ భేద రూపముల కారణముననే జీవులు శరీర భోగములకు లోనగుదురు. ఈ భోగములే శరీర ఇంద్రియ సుఖములే శాశ్వత సుఖజీవిత ఆశయములని జీవులకు అనిపించును.జీవులు ఇట్టి మమతల జిక్కి అహంకారము పెంచు కొని కామ, క్రోధ, లోభ, మదమాత్సర్యములకు గురియగుదురు. వారు అసంతృప్త మాన సులై యుండుట చేత వారి ముందుక్షోభ అశాంతి ఎల్లెడ అనుభవమగును ఇట్టి మహా తృష్ణలో ఇంద్రియములకు పరమైన ఆత్మానందమనునది ఉన్నట్లు జీవికి కొంచెమైనను బోధపడదు. ఈ మహామాయను పుట్టిన భావములు చేష్టలు పరమ మూర్ఖములు, అమిత అజ్ఞాన ప్రవర్థకములు, సుజ్ఞానమును దహించినది. ఈ కారణముననే లోక నాటకమును శాశ్వతముగ నిల్చి రసవంతముగ సాగును. దేహలింగ రూప మాయాశక్తి ఆ మహదేవుని మహాదివ్య ప్రజ్ఞాన చిచ్ఛక్తిని జనించిన ప్రకృతి విశేషమే ఈ లోక నాటకము విశ్వకర్మ కు ఒక లీలా వినోదమే. ఇది చాల అత్యాశ్చర్యకర విషయము.



## 7. భిన్నాయత్త్రము :

ఆ మహాయుగమున విశ్వరూపుడైన విశ్వకర్మ తానే శ్రీవత్సాంకుడు చతుర్భుజుడగు మహా విష్ణువాయెను. ఆ యుగ మందు సమస్త సృష్టియు విష్ణుమాయచే జరిగింది. విశ్వకర్మ విష్ణు స్వరూపుడై సమస్తమును నాడు సృష్టించెను. లోకసృష్టి స్థితిలయములకు కారణ శక్తులైన శంఖుచక్రములను ధరించిన వాడు. ఆయన వక్షమే అష్టలక్ష్మీ సంపన్నమై సృష్టిని పోషించుచున్నది. శివ మానస భావమే విష్ణుశక్తి. విష్ణుదివ్య ప్రకాశమే శివుడు శివుడే విష్ణువు. విష్ణువే శివుడు. అతడు ఉత్సాహి, సర్వగుణ సంపన్నుడు, నిత్యయువకుడు, నిర్భయుడు, చిదానంద స్వరూపుడు. సత్వగుణ శోభితుడు, లక్ష్మీనారాయణుడు కాగా పార్వతీ పరమేశ్వరుడు సృష్టిలో జనించిన వయోవృద్ధుడు లోక సంప్రీతిని తలంచువాడు. జగదాధార మైన గంగకు సృష్టిలో ప్రథమ స్థానమిచ్చి, శివుడామెను శిరస్సున దాల్చినాడు. ఆ గంగామాతనే లోకమునకు సకల జీవనాధారము చేసి జీవకోటి సృష్టి, స్థితి, లయ పోషకముగా విష్ణువు ఆమెను తన పాదమునందే అదిమి ఉంచి పోషించుచు విష్ణువు, నారాయణుడను సార్థక నామమును వహించినాడు. అట్టి నారములు ఘనసారగుళికగా రూపొందిన వాడే నరుడు. నరనారాయణ రూపులే అర్జున శ్రీకృష్ణులు.

వ్యాప్తి, ప్రవేశము అర్థము రాగల "విషల్ వ్యాప్తౌ" అను ధాతువునుండి పుట్టిన విష్ణు శబ్దము సర్వవ్యాపక పరబ్రహ్మమునే సూచించుచున్నది. శంఖు, చక్ర, గమన శక్తులుగల విష్ణువు కుండలినీ శక్తిని ఆధారణమునుండి సహస్రారము వరకు వ్యాపించిన వాడాయెను. సహస్రారమున క్రీడించి ఆ ప్రభువు పరంధాముడయినాడు. ఆయనే పరంధామ వాసి యైనాడు. అమృతతత్వము అనగా సర్వసంసార బంధ విముక్తి రూపమైన పరమానందామృత స్వభావమే అచ్చట వెలసినది. శ్రీ మహావిష్ణువు, శంఖు, చక్ర, పీతాంబరధరుడు, జలధరదేహుడు, పంకజాక్షుడు, ఆజానుబాహుడు, అయి వెలసినాడు. సాత్వికులన నిజభక్తజనులకు ఆర్తత్రాణ పరాయణుడు. ప్రాణ, ధన, మాన, రక్షకుడు, కల్పవృక్షుడు అయినాడు. తామస, రజోగుణ భావితులగు రాక్షస స్వభావులకు ఆ మహాశక్తి ఘోర శత్రువై వారికి సింహస్వప్నమై వారిచే తన యొక్క నిజశక్తిని ప్రాభవముకు గుర్తింపచేయు ప్రజ్ఞానిధి అయినాడు. లోకనాటక మందలి అద్భుత రహస్యము. సకల జనులు "సత్" ను అవలోకించుట యనుట యధార్థము.

సత్యధర్మములను అసాధారణమగు ప్రకృతియొక్క విశేషగుణ భావములనే లోకనాటకము సుఖాంతముగ నిల్చిసాగుచున్నది. జీవకోటికి జీవనాధారమగు నదీ జలములు వరదలో సాధు, ఘాతుక జనులను నరకుగొనవు. అది సమస్తమును ముంచెత్తును. కాని నీరసించి భూమాతను శక్తివంతముగ జేసి ఆమె గర్భమును ఫలింపచేయును. జీవులకు అన్నోదకములుకల్పించి రక్షించును. శిష్టాచారరక్షణమే సద్గుణము. దుష్టాచార ఖండనమే లోకధర్మము. "అతి సర్వత్రవర్జయేత్" అనునదే సర్వజీవలోకమునకు సత్యథము. ధర్మాధర్మములు సత్యాసత్యములు అతి సూక్ష్మముల దానికి మార్గములు సవ్యములు, అపసవ్యములు కూడ యగుట ప్రకృతి యందలి సత్యము. ఇట్టి సుగుణ సంపదను, భూమిని ఏలు పృథివీ పతు లెల్లరు శ్రీమహావిష్ణువు అంశలే.

ఋగ్వేద దశమ మండలములోని 185వ సూక్తము 1వ మంత్రము విష్ణువుగర్భాధాన స్థానమగు యోనిని కల్పించువాడని వక్కాణించుచున్నది. అది గర్భదాన సంస్కారమున ఉపయోగించు మంత్రము.

**"విష్ణుర్యోనిం కల్పయతు, త్వష్టా రూపాణి పింశతు**
**ఆసించతు ప్రజాపతి, ర్ధాతాగర్భం దధాతుతే".**

భాష్యం :- విష్ణు ర్వ్యాపకోదేవో యోనిం గర్భాధాన స్థానం, కల్పయతు కరోతు త్వష్టా తనుకర్తా ఏతత్సంజ్ఞ కోదేవశ్చ రూపాణిని రూపకాణి స్త్రీత్వ పుంస్త్వ భిన్నం కాని చిహ్నాని, పింశతు-అవయవీకరోతు"-- ఇట్లమాట చేత సర్వవ్యాపకుడు అగు విష్ణువు యొక్క అనుగ్రహము గర్భధారణముచేయబోవు యువతులకు అవసరమని తెలుచున్నది.

## 8. అభ్యాంతము :

ఆ మహాయుగమున అద్వితీయుడైన విశ్వకర్మ భగవానుడు. ఈ బ్రహ్మచేత సమస్త సృష్టిని జరిపించినాడు.. శ్రీ మహావిష్ణువు యందలి దివ్య అనంత రూపం బ్రహ్మ. ఈ మహా దివ్య స్వరూపుని కుమారుడు. తండ్రి పనుపున సృష్టి చేయుటయే ఈయన పని రజోగుణ ప్రకాశితుడగు ఈ మూర్తికి గల శాస్త్రమను మహాశక్తి పేరే సరస్వతి. ఆమె శబ్దబ్రహ్మరూప మహామంత్రశక్తి. ఈ శక్తి ప్రభావమున జనించి భాసించునదేజీవలోక నాటకము. దేవమానవ రాక్షసాది గుణముల సర్వప్రవర్తనలు రజోగుణముననే అహంకార మమకారములు ప్రజ్వరిల్లును. అజ్ఞాన వీచికలు వృద్ధిగాంచును.

జీవలోక నాటక సృష్టికి సహజ సమ్మోహన శక్తి సంపద ఎంత కావలెనో తలంచ నలనికాదు. కాని అట్టి మహో సంపద నూహించి చిత్రించి సృష్టించి సుఫల మనోరధుడైన వాడే వేదబ్రహ్మ అమ్మహనీయశక్తి అమృత మయము. మహో సంపదకరము. బ్రహ్మే అట్లు మహామానస మహాకావ్యకర్త సుందరతమ సృష్టికర్త రహస్యవేత్త.

ఋగ్వేదమున సృష్ట్యాదులను చేయు దేవుడుగా పేర్కొనబడిన వారిలో త్వష్టఒకడు. వేదములందన్నింటను అతడు అడుగడుగునను దర్శనమిచ్చెడి. జగదీశ్వరుడు. అతడు సమస్త రూపములను సృష్టించు దేవుడు. అతడు అగ్ని రూపమును గూడ తాల్చి ఋత్విక్‌లయు, యజమానులయు కోర్కెలను తీర్చుచుండును. జ్ఞానమనెడి ధనము కలవాడును సత్యలోక పతియు అగు త్వష్టబ్రహ్మ మనకోర్కెలను తీర్చి రక్షించునని తెలియుచున్నది. త్వష్టభువనములను సృష్టించిన వాడే కాక వాటినిపాలించిన భువన పాలకుడని స్పష్టము చేయబడినది. ఇంకను ఋగ్వేదము పదవ మండలమున నూట పదవ సూక్తము 9వ మంత్రములో ఇట్లు తెలుపుచున్నది. ఏ త్వష్టదేవుడు ఈ భూమ్యాకాశములను దేవ మనుష్యతిర్యక్. స్థావరాది భేదములతో నిండినవైన స్వర్గమర్త్య పాతాళ లోకములను సృష్టించినవాడే అట్లే సమస్త భువనములను రూపము కలవానిగా ఒనర్చెనో, అట్టి త్వష్టను ఈ యజ్ఞకార్యమునందు హవిస్సు మొదలగు వాటిచేయజింపుమని తెలియుచున్నది. హవిస్సులచేతను పూజాధ్యాన సమాధుల చేత గూడ ఆ దేవుని ఆరాధించి తలించమని యందలి రహస్యార్థము. దీనిని బట్టి సర్వబ్రహ్మాండములను భూత జాతములు సృష్టించిన వాడు త్వష్టయని తెలియుచున్నది. అనగా తనూకరణము చేయుచున్నాడు. అనగా శరీరము లేనిదానికి శరీరమును కల్పించుచున్నాడని భావము. అనగా క్రియా రూపములకు రూపనిర్మాణము చేయుచున్నాడు. దీనిని బట్టి సృష్టికర్తయైన బహ్మకు రూపాధి పత్యముతోబాటు శిల్పాధిపత్యము కూడ ఉన్నట్లు స్పష్టమగు చున్నది. అనగా త్వష్ట గర్భమందుంచబడిన రేతస్సులకు రూప నిర్మాణము చేయుచున్నాడని ఋగ్వేదము తెలుపుచున్నది. మనవైదిక వాఙ్మయమున ధాత, ప్రజాపతి అనుదేవతలు ఒక్కరుగా వర్ణింపబడియున్నారు. రేతస్సునకు రూపకల్పన చేయుదేవుడు త్వష్టయని యజుర్వేదము చెప్పుచున్నది. రూప నిర్మాణము సర్వాత్మకుడును జీవులను ప్రేరేపించు వాడునుఅగు త్వష్టదేవుడు గర్భము

నందుండగనే మనలను దంపతులుగా నొనర్చినాడు. ఈ మాటలు యమాయమ సంవాదములోనివి కనుక దాంపత్య నిర్మాణముకూడా చేయునది త్వష్టదేవుడని వేదమున పలుతావుల చెప్పబడినది. "త్వష్టైవై పశూనావ్ం మిథునా నాంరూపమకల్పయత్" అనెడి తైత్తరీయ సంహితా వాక్యమును త్వష్టదేవుడు వధూవరులను సృష్టించిన దేవుడని పలుకుచున్నది. ఇంకా ద్వితీయ మండలమున 'ఏదేవుడు కులము నుద్ధరించు పుత్త్రాదులు నిచ్చుచున్నాడో అట్టి త్వష్టదేవుని అనుగ్రహము వలన బంగారు కాంతి గలవాడను యజ్ఞములు చేయ గలిగిన వాడును, అన్నదాతయు, గుణవంతుడును. దేవతల కిష్టుడును నగు పుత్త్రుడు మీకు జన్మించుగాక అని చెప్పచున్నది.

జగత్పిత ప్రజాపతియుయ్యైన త్వష్టబ్రహ్మను పురాణ వాఙ్మయమున చతుర్ముఖ బ్రహ్మను చేసి పూజార్హత లేనివానిగా ప్రచారము చేసినది. బ్రహ్మదేవునికి గుళ్ళుగోపురాలు కట్టి పూజింపనప్పటికి సర్వులు త్వష్టబ్రహ్మ యొక్క మహిమను గ్రహించి యజించుట వలన సకల శ్రేయములను బడయగలరు.

**విష్ణుర్యోనిం కల్పయతు, త్వష్టారూపాణి పింశతు,**

**ఆసించతు ప్రజాపతి ర్ధాతాగర్భం దదాతుతే"**

ఋ 10-185-7

ఓ కన్యారత్నమా! విష్ణుదేవుడు నీ మర్మావయవమును వీర్యాధారణ యోగ్యముగా ఒనర్చును గాక! త్వష్టదేవుడు మీ దంపతుల కర్మననుసరించి స్త్రీ పురుషాది రూపములను సృజించుగాక!

ఈ దిగువ మంత్రమును పఠించిన గాని వివాహకాండకు పరిపూర్ణత్వము రాదు.

**"త్వష్టా జాయా మజనయత్ త్వష్టా స్యైతాస్త్వపతిం**

**త్వష్టా సహస్ర మాయూగ్ం షి దీర్ఘమాయుః కృణోతుణామ్"**

॥ఏకాగ్ని మంత్రము॥

ఓనరుడా త్వష్ట అను దేవుడు నీకీ భార్యను సృజించి యిచ్చెను ఆత్వష్టయే ఈమెకు నిన్ను పతిగా సృష్టించినాడు. అట్టి త్వష్టదేవుడు వధూవరులకు మీ ఉభయులకు దీర్ఘాయుర్భాగ్యము నొసంగుగాక అని భావము.

## 9. అనాభ్యాంతము లేక మహాభ్యాంతము :

ఆ మహాయుగమున పరశివ విశ్వకర్మ ముందుగా శిల్పి బ్రహ్మాయైన ఇంద్రుని సృష్టించినాడు. ఆ ఇంద్రుడు ఋగ్వేదమునందు 250 సూక్తములతో స్తుతింపబడినాడు. అతని భౌతిక, ఆది దైవికములైన క్రియలు పెక్కులున్నవి. ఆధ్యాత్మికముగా అతని స్వభావమేమో పరిశీలింతము.

ఇంద్రుడు తన మహిమచేత అగ్ని మొదలగువారి రూపములను అందు చున్నాడు. అతడు పొందిన నానారూపములు అగ్ని విష్ణు రుద్రాదులనెడి భేదములను తెలిసికొనుటకు ఉపయోగించుచునవి. ఈ ఇంద్రుడుతన సంకల్పముల చేత బహువిధ శరీరరములు గలవాడై ఆయా ఆరాధకులను చేసుకొను చున్నాడు. ఈతని రథమునకు ఉన్న గుఱ్ఱములు పదివేల సంఖ్య గలవిగాన. ఒకే సమయమున నానారూపముల దాల్చి ఆయా ఆరాధకుల దగ్గరకే గలడు. ఇది ఆదిదైవిక అర్థము.

**ఆధ్యాత్మిక అర్థము చూడుడు :**

ఇంద్ర శబ్దమునకు ఈశ్వరత్వము కలవాడని చెప్పకొనుట చేత పరమాత్మ అని తెలియుచున్నది. ఇంద్రుడనగా ఆకాశము వలె సర్వగతుడును సదానంద రూపుడును అగు పరమాత్మ ప్రతి శరీరమునందును ప్రతి బింబరూపమున ఉండెను. చిన్మాత్రుడైన తాను అంతఃకరణోపాధుల యందుజీవరూపుడై ప్రకాశించెనను ఈ ఇంద్రుని యొక్క ప్రతి బింబరూపము, నియంతవ్మైన ఆకారదర్శనార్థమ్మై ఉపయోగించు చున్నది. ఇంకను ఆ ఇంద్రుడు మాయా శక్తుల చేత అనేక రూపములు కలవాడు. అనగా ఆకాశాది నానా రూపములు కలవాడై ఒప్పచున్నాడు. ఇది కూడ ఆ పరమాత్మ జ్ఞానమును పొందుటకు పయోగించుచున్నది. ఈతనికి గుఱ్ఱముల వంటినని చెప్పదగిన ఇంద్రియ మనోవృత్తులు. విషయములను గ్రహించుటకు ఉపయోగించినవియై యున్నవి. అనగా జీవులకు కలిగెడి ఆయా మాన సాదులైన ఇంద్రియ వృత్తులు అంతర్ముఖులైనచో ఆపరమాత్మ దర్శనమునకే తోడ్పడు చున్నవనుట పరమార్థము.

ఇంకను ఋగ్వేద మిట్లనుచున్నది. ఓఇంద్రుడా నీవు శత్రువులను జయించినావు. నీవు సూర్యుని వెలుగులచే దీప్తి కలవానిని చేసినావు. నీవు

విశ్వకర్మవవు అనగా సృష్ట్యాది కర్మలు కలవాడవైనావు. అంతియేకాదు. నీవు విశ్వదేవుడవు. సర్వదేవాత్మకుడవు అయితివి. అంతియేగాక స్వామియు, ప్రత్నరూపుడును అగు ఇంద్రునికై హృదయము చేతను మనస్సు చేతను, బుద్ధి వలన కలిగిన జ్ఞానము చేతను స్తుతులను లేక కర్మలను చేయుడు.

ఓ ఇంద్రా నీవు సర్వశక్తులకు నివాసమై రత్నగర్భగా పేరొందిన పృథ్వికి ప్రతినిధివగు చున్నావు. అనగా నిన్ను ఉపాసించినవారికి రత్నగర్భవలె సర్వశక్తుల నిచ్చుచున్నావు. అట్లే సమస్త శక్తులకు నివాసమైన స్వర్గలోకమునకు కూడ నీవే పతివగు చున్నావు. ద్యావా పృథువులకు నడుమ ఉన్న అంతరిక్ష లోకము నందును నీ మహిమచే వ్యాపించినావు. అందు అసత్యములేదు. నీవు సర్వవ్యాపకుడవు, సర్వరక్షకుడవూ అనుట సత్యము. కావున నీతో సమానుడు ఇంకొకడు లేడన్న మాట. అనగా ఇంద్రాదులను పరాత్పర విశ్వకర్మనుగా వర్ణించుటయే వేద ఋషుల అంతర్హృదయము.

ఏ ఇంద్రుని యొక్క విశ్వవ్యాపక స్వభావశక్తిని ద్యావా పృథువులు పొందజాలవో అంతరిక్షమున నున్న స్రవించు స్వభావముగల జలములు సైతము ఏ ఇంద్రుని శక్తిని అడ్డగింప జూచు వృత్రాదులు కూడ అతనితో తలపడి గెలువలేరో అట్టి సర్వశక్తి సంపన్నుడు వయిన ఇంద్రా నీవొక్కడవే సమస్త విశ్వమును స్వాధీన
మొనర్చు కొని ఎదురులేక ప్రకాశించుచున్నావు.

ఈ విధముగా సర్వేశ్వరుడుగా, సర్వజ్ఞుడుగా, సర్వశక్తుడుగా వర్ణింపబడిన ఇంద్రుడు "అహల్యాయై జారః" మొదలయిన వాక్యముల చేత అహల్యా కాముకుడుగా పూరాణ కధలలో చిత్రింప బడుట శోచనీయము. "అహల్య అనగా హలము తాకిన నేల" యనియు అట్టి దాని యందు వర్షించి సస్యౌషధులను మెలిపించువాడే ఇంద్రుడనియు చెప్పి కొనవలయును గాని ఇంద్రుడు అహల్యను కామించి భ్రష్టుడయినాడని ఏల ఎన్నవలయును? కనక వేదార్థమునకును. పురాణ కధలకును ఇట్టి తారతమ్యము లుండునని గ్రహించవలయును.

## 10. అనీరణము :

అనీరణమనెడి ఈ మహా యుగమునందు మహాదేవుడైన విశ్వకర్మ ముందుగా సూర్యుని సృష్టించినాడు. పిమ్మట ఆ సూర్యుడు సమస్తమును సృష్టించినాడు. బంగారు కాంతి కలవాడును వేయి కిరణములు గలవాడును, సప్తాశ్వరథమునెక్కి తిరుగువాడును, పద్మాసనముతో ప్రకాశించువాడును, పద్మములనుకేల దాల్చిన వాడును, పద్మములచే పూజింపబడువాడును. పద్మాకారమండలమున నుండువాడును. బంగారు వలువలను దాల్చిన వాడును కిరీట హారకేయుర కుండలాది ఆభరణములు కలవాడును. శంఖ చక్ర పాశములను ధరించినవాడును. చీకట్ల నడంచువాడును. కర్మ సాక్షియున్నై సంబోధముద్రతో గూడి నిద్రలో మునిగిన విశ్వమును మేల్కొలుపుచు ప్రకాశించుచుండును. అట్టి సువర్ణ బ్రహ్మ సూర్యుని గూర్చి ఋగ్వేద మేమనుచున్నది ? పరిశీలింతము. స్వయముగా ప్రకాశించుచున్స్వయం ప్రకాశము లేని వాటిని గూడ ప్రకాశింపజేయు ఓ సూర్యదేవా! నిన్ను సప్తసంఖ్యగల కిరణములు (గుఱ్ఱములు) రథముపై కూర్చుండ బెట్టి లాగుచున్నవి. అనగా సప్తవర్ణములు గల కిరణములతో ప్రయాణము చేయుచున్నాడని భావము. ఆయన వెలుగులే కేశములుగా గలవాడు. సూర్యుని సప్తకిరణములకు ఆధ్యాత్మిక అర్థము చెప్పికొనవలసి వచ్చినప్పుడు భౌతికమ్మైన వెలుగే కాక తాత్వికమ్మైన జ్ఞానరూపముగా కల పరమాత్మకూడ అయి ఉన్నాడు. ఈ పరమాత్మను ఆధారాది చక్రముల మూలమున కుండలిని నడిపించి సహస్రారముననే. సాక్షాత్కరిం పజేసి కొనవలయును. ఆ రహస్యమునే మంత్రము నిన్ను సప్తాశ్వములు మోయుచున్నవని చెప్పినది. ఈ సప్తకిరణములు సప్త ఋషులకును సంకేతముల్తై వారికి సూర్యరూపపరమాత్మ ఆరాధ్యుడై పొంద దగిన వాడిననెడి రహస్యమును కూడ చాటుచున్నది.

మహానుభావుడైన సూర్యుడు భూత, భవిష్యత్ వర్తమానము లనెడి మూడు కాలములు చేత బాధింపబడక వెలింగెడి అఖండ పరంజ్యోతి యనెడి పరమాత్మ స్వరూపుండని నిరూపించ బడినది.

సూర్యుని రథము ఒక్క చక్రము మాత్రమే కలది దానిని ఏడు పేర్లుగల ఒకే అశ్వము లాగుచున్నదట. అనగా సప్త విధములు గల ఒకే వాయువు

లాగుచున్నదని భావము. సప్తశబ్దము చేత ఏడు రంగులుగల కిరణమని గూడ భావింపవచ్చును. ఈరథము శిథిలము కానిదీ వీగి పోవనిదియు దాని యందే సమస్త భువనములును ఆధారపడి యున్నవి. ఇట్లని ఆది భౌతికార్థముగా సూర్యగోళమును చెప్పి ఆధ్యాత్మికముగా కాల స్వరూపమును నిరూపించి ఆకాలమునకు అధిపతియైన విశ్వకర్మపరమేశ్వరుని ఎఱుంగుటచే మోక్షము కలుగును అనెడి పరమార్థమును తెలుపుచున్నది.

ఇట్టిసువర్ణ వాచ్చ్య సూర్యభగవానుడు మతసిద్ధాంత భేధములు లేక ఎల్లరికిని ఆరాధ్యుడగుటలోని రహస్యము గ్రహింతురుగాక పూర్వ ఋషులని చెప్పదగిన ద్రష్టలు సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సువర్ణులనెడి పంచబ్రహ్మ ఋషులు ఆదిత్యాత్మకుడైన విశ్వకర్మనుతేజోరూప పూజా ద్రవములతో పూజించిరని ఋగ్వేద భాష్య కర్త సాయణులు వ్రాసినారు.

**11. మనీరణము :-** మనీరణమనెడి ఈ యుగమునందు దేవుడగు నీశ్వరుడు విశ్వకర్మయందు మనురూపముతో నుదయించి సమస్త సృష్టిని కావించెను. చతుర్దశ మనువులు ఈ సృష్టిని పాలించిరని సనారి విశ్వనాథ అవదూత తెలిపియున్నారు.

**12. మన్వారణము :-** మన్వారణ మనెడి ఆమహాయుగమునుందు చతుర్భుజుడైన విష్ణువు విశ్వకర్మయందు మయరూపముతో నుదయించి సమస్త సృష్టిని గావించి పాలించెనని గ్రహించ నగును. ఏకవింశతి (ఇరువది ఒక్కమంది) మయబ్రహ్మలు సృష్టిపోషకులై పాలించిరని విశ్వనాధావధూత స్వామివారు వ్రాసియున్నారు.

**13. విశ్వారణము :-** విశ్వారణమనెడి ఆ మహాయుగమునందు విశ్వకర్మ బ్రహ్మదేవుని యందుత్వష్టరూపమున ఉదయించి సృష్టిగావించెను.

**14. విశ్వసృష్టి :-** ఈ మహాయుగమునందు విశ్వకర్మయందు ఇంద్రుడు శిల్పిరూపమున జన్మించి సమస్త సృష్టిని పరిపాలించెను.

**15. కృతయుగము :-** ఈ యుగమున మహావిష్ణువు విశ్వకర్మయందు త్రివిక్రమావతారమును దాల్చి, భూమి, అంతరిక్షము, ద్యుమలోకములనెడి మూడు స్థానములందు ధర్మధారణ కోసమై మూడుపాధములనుంచెను. దీనినే బలిచక్రవర్తి గాథగా తెల్పుదురు. ఇదియే వామనావతార చరితమని పురాణములు తెల్పుచున్నవి.

**16. త్రేతాయుగము :-** ఈ యుగమునందు విష్ణువు రాముడుగా జన్మించి రాక్షస సంహారముగావించి ధర్మరక్షణ గావించినాడని రామాయణము తెల్పుచున్నది.

**17. ద్వాపరయుగము :-** ఈ యుగమునందు విష్ణుమూర్తి శ్రీకృష్ణుని గా జన్మించి దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించి ధర్మోద్ధరణ చేసెనని భారత, భాగవతాదిగ్రంథములు తెలుపుచున్నవి. శ్రీ కృష్ణుడు భగవద్గీతను బోధించి తానే భగవంతుడనని నిరూపించుకొన్నాడు. అద్వైతతత్వమును బోధించి ఆయన కృష్ణపరమాత్మఅని పించుకొన్నాడు.

**18. కలియుగము :-** ఈ కలియుగమున గూడ శ్రీమహావిష్ణువు విశ్వకర్మయందు కల్కిరూపమున అవతరించి ధర్మరక్షణ గావించునని పురాణములు తెలుపుచున్నవి.

చతుర్యుగములలో సర్వదేవతా మయుడైన సూర్యుడు విశ్వకర్మ యందు విశ్వకర్మ యందు విశ్వజ్ఞబ్రహ్మగా ఉదయించి సృష్టికే ప్రభుడై ప్రకాశించెనని విశ్వకర్మ పురాణము తెలుపుచున్నది.

వేయి కోట్ల సంవత్సరముకొకసారి ప్రపంచము పుట్టును.

**పూర్వేవేదస్సమ జాయంత పంచభ్యోయే ముఖేభ్యః**
**తస్మాత్పంచాక్షరో విరాట్ సానగాది పంచఋషియ స్సంజాతః**
**సద్యోజాత వామదేవా ఘోర తత్పురుతషేశానాఖ్యాః**
**పూర్వాననాత్సనగః దక్షిణా త్సనాతనః**
**ప్రత్నఉదీచ్యాం ఊర్ధ్వాత్సుపర్ణః ఏభిః పఠితాః**
**ఋగ్యజుసామాథర్వణ ప్రణవాఖ్యాః**

తా॥ పూర్వము నా (విశ్వకర్మ) ముఖమునందు వేదము లుద్భవించినవి. అనంతరము పంచాక్షరి, సానగాది పంచఋషులు ఉద్భవించిరి. వీరలు సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష ఈ శానులు అనువారలు, తూర్పు ముఖమునందు సానగ ఋషి, దక్షిణముఖమునందు సనాతన ఋషి, పశ్చిమ ముఖమునందు అహభూనఋషి, ఉత్తరముఖమునందు ప్రత్నఋషి, ఊర్ధ్వముఖముందు సుపర్ణ ఋషి అనువారలుద్భవించిరి. వీరలచే పంచవేదములగు ఋగ్వేదము, యుజుర్వేదము, సామవేదము, అధ్వరణ వేదము ప్రణవవేదము పఠించబడినవి.

శ్లో॥ మయాప్రోక్తం మనుర్నామ సాక్షాదీశ్వర ఏవచ
మయో నారాయణ స్సాక్షీ త్వష్టా సాక్షి ల్పితామహః
శిల్పీచాఖండల సాక్షీ ద్విశ్వజ్ఞసూర్య్య ఏవచ
య[illegible]నుపాసతే నిత్యం సర్వమంగళ శృతేయ:
ఏకం మేకం యజతే సర్వపూజాఫలం భవేత్. ॥ ॥"విశ్వబ్రహ్మోపనిషత్"

తా॥ నా (విశ్వకర్మ) నుండి ఉద్భవించిన మనుబ్రహ్మసాక్షాత్ ఈశ్వరుడు. మయబ్రహ్మ సాక్షాత్ నారాయణుడు, త్వష్ట బ్రహ్మ సాక్షాత్ బ్రహ్మదేవుడు, శిల్పి బ్రహ్మ సాక్షాత్ దేవేంద్రుడు. విశ్వజ్ఞబ్రహ్మ సాక్షాత్ సూర్యుడు. నిత్యం వీరిని ఉపాసించువారికి సమస్త శుభాలు కలుగునని శృతియనుచున్నది. అట్టి వారికి సమస్తమైన పూజా ఫలము కలుగును.

పంచబ్రహ్మలు పంచభూతములకు ప్రతీకలు. పంచభూతముల సృష్టికి హేతుభూతమైన అఖండ పరబ్రహ్మ స్వరూపమే విశ్వకర్మ నామక ఆదిశక్తి, తన్నుఅర్చించు విశ్వమంతటికిని ఐహిక, ఆముహిక, పారమార్థిక సుఖముల నొసంగు వాడా దేవాదిదేవుడు విశ్వకర్మ

హిందువులు ఇతర మతముల లోనికి మారడం జరుగుచున్నది. చదువుకొని ఉద్యోగం చేసే వాళ్ళు కూడా ఆకర్షితులగు చున్నారు. అంటే హిందు ధర్మ నిర్వహణలో కూడా ఎక్కడో లోపమున్నదని పించుచున్నది. భిన్నత్వంలో ఏకత్వం సాధించిన గాని ఈలోపము సవరించబడదు. అందుకుగాను క్రొత్త సహస్రాబ్దిలోనైనా ఋగ్వేదము లోని 81, 82 సూక్తములలో తెలుపబడిన దేవుడు అయిన విశ్వకర్మ ఆధ్యాత్మిక శకాన్ని ప్రారంభించి ప్రచారం గావించేందుకు వివిధ మతాధిపతులు, పీఠాధి పతులు, మత విశ్వాసులు కలిసి పనిచేసి భిన్నత్వంలో ఏకత్వం సాధించాలి. అప్పడే హిందువులలో ఐక్యత, అవగాహన ఏర్పడుతుంది. బ్రహ్మ జ్ఞానము నెఱింగిననే గాని మానవునికి దృఢచిత్తము ఏర్పడదు.

ఇందుకుగాను పురాణ గాధల నధిగమించి వేద విజ్ఞానమును ప్రచారము గావించవలెను. మానవునిలో భక్తి భావము ప్రేమ తత్వమును పెంపొందించి నవసమసమాజ నిర్మాణమునకు కృషిచేయుట అందరి కర్తవ్యముగా భావించవలెను.

# విశ్వ కర్మ - సృష్టిరహస్యము

**శ్లో॥ సర్వ మీశమయం విశ్వం, విశ్వమేవ స ఈశ్వరః !**
**అభేద ఇతియో వేత్తి, సజ్ఞానీ గురు సూక్తిభిః !!**

సమస్తమైన విశ్వమును ఈశ్వర స్వరూపమేయనియు, విశ్వమే ఈశ్వరుడనియు ఆ రెంటికి భేదము లేదనియు ఎవడు గురు వాక్యములచే నెఱుంగునో అతడే జ్ఞాని.

**" క్రియాయస్యసః విశ్వకర్మ క్రియతే ఇది జగత్కర్మ**
**విశ్వ కర్మ యస్యేతివా విచిత్ర నిర్మాణశక్తి మత్వా విశ్వకర్మ"**

॥ ఇది విశ్వకర్మ పదమునకు శంకర భాష్యము॥

విశ్వకర్మచే నిర్వహించబడు కర్మ ఏదైతేకలదో అది జగత్కర్మ ఆవిశ్వకర్మ మహోన్నతమైన, బృహత్తరమైన విచిత్ర విశ్వ నిర్మాణ శక్తిమంతుడగుటచే అతడు విశ్వకర్మగా కీర్తింపబడుచున్నాడు.

ప్రపంచము పరమాణువుల చే నిర్మించ బడినది. కుండను తయారు చేయుటకు కుమ్మరివాడు ఉండవలయును గాదా ! అట్లే విశ్వమును సృష్టి కర్తయే "విశ్వకర్మ" అని న్యాయ దర్శనము భగవంతుని ఉనికిని నిరూపించుచున్నది.

**శ్లో॥ అజాయత జగత్సర్వం సృష్ట్యాదౌ విశ్వకర్మణః !**
**స ఏవ కర్తా విశ్వస్య విశ్వకర్మ జగత్పతిః !! ॥వి ॥ క॥పు॥**

సృష్టికి మొదట విశ్వకర్మ నుండి యే జగమంతయు పుట్టినది కనుక విశ్వమునకు అతడే కర్త అతడే ప్రభువు. విజ్ఞానవంతుడుగు ప్రతి మానవుడు. ఆశ్చర్యకరమగు సృష్టిని గాంచి ఆనందింపక మానవుడు కన్నులను ఆకాశము మీదికి సారించినచో నటీనద గ్రహ తారకా గణములు, భూమి మీదికి ప్రసరింప జేసినచో నటీనద పర్వతారణ్యములు అందలి చిత్ర విచిత్ర వస్తువులు, ప్రాణులకు ఎంత వింత గొలుపు చుండునో ఆలోచించిన తెలియ గలదు. ఇంత వింతగా ఉన్న ఈ సృష్టి శాశ్వత మనుకొందమా అన్నచో కాదు. దీని ప్రమాణము పది ప్రక్కన ముప్పది సున్నలు పెట్టిన ఏర్పడు సంఖ్యకు సమాన మగునన్ని కోట్ల సంవత్సరములు. అవి తెలియు చున్నది. ఈ సృష్టి క్షణ క్షణమునకు మారుచు ఎన్నో దశలకు గురియగు చుండును.

జీవులకు తనువులు శాశ్వతం కాదు. కాని నరులకు నిజముగ ఎవరి తనువులు వారికి శాశ్వతముగనే తోచు చుండును. ప్రపంచమందలి సకల మూలక పదార్థములు జీవులు భూమి, సూర్యుడు, నక్షత్రములు శాశ్వతములుగా కన్పించు చున్నవి. ఇంతే కాక జీవ లోకమున విత్తు ముందా ? చెట్టు ముందా ? దేవుడున్నాడా ? మంత్రములకు శక్తి కలదా? అను ప్రశ్నలకు సమాధానము కన పడుడలేదు. పైగా వేదము "యద్దృశ్యం తన్నశ్యం" అంటుంది. అనగా కనబడునదంతానశిస్తుందని.

ఈ సృష్టి అంతయు ఎటు నుండి ఎటు పోతుందో ఈ విషయములు ఒకదాని కొకటి భిన్నములు కాని ఇవి వేద సత్యములు. ఆ వేదమే భగవంతుడు వేదవేద్యు డైన విశ్వకర్మ అంటున్నది. అది ఎట్లు? అది తెలియ నేర్చుటే జ్ఞాన జీవి నరునకు ముఖ్య జీవిత విధి ప్రకృతి రహస్యములను అత్యద్భుతముగా వెల్లడించు వేదశాస్త్ర పరిశోధనలే ఈ సందేహమునకు పటాపంచలు చేయ గలవు.

ఆధునిక శాస్త్ర పరిశోధనలో శాస్త్రజ్ఞులు తెలుపు చున్న ప్రకృతి రహస్యములు అత్యాశ్చర్యాన్ని కలిగించుచున్నవి. శాస్త్ర ప్రకారం మనకు తెలిసిన దివ్య విద్యుదయస్కాంతములు, రేడియో లేజరు మొదలగు శక్తిరూప తరంగములు, దూరదర్శన్, దూర శ్రవణాలకు ఆధారమగు తరంగములు, కాంతి, సమస్తము అణుశక్తి నుండి రూపొందినవే. అణుశక్తి అనునది ప్రొటానులు, న్యూట్రానులు, ఎలక్ట్రాన్ లు అనునట్టి భేదముల కలయికతో ఏర్పడినవే. ఈ శక్తి భేదములే మరల క్వార్క్సుగను, హెడ్రాన్‌లు గను మారు చున్నవి. ఇక బొగ్గు నుండి సర్వమూలక పదార్థములు అణుశక్తి నందలి సకల పదార్థములు, విత్తనములు, శరీర జీవకణములు ఈ పరిశోధనా ఫలితం గా ఆశక్తి లోనే అత్యద్భుతంగా ఆవిర్భవించి గోచరించుట యథార్థం అని గ్రహించ గలము.

విశ్వకర్మ తన కంటె భిన్నమైన ఉపాదాన కారణములతో జగత్తులను ఉత్పాదింపలేదు. నిమిత్తోపాదనములు రెండును అతడే అయి సృష్టి చేసినాడు. అతడే ఆదిశక్తి ఈశ్వరుడు పరమాత్మ పరబ్రహ్మము. మహ్మదీయులకు అల్లా, క్రైస్తవ లోకమునకు యెహూవా,వివిధ మతస్థులు వివిధ నామములతో పేర్కొను దేవుడు.

పైన పేర్కొనిన అణుశక్తి మొదలగు వివిధ శక్తులు విశ్వకర్మ భగవానుని శక్తి విశేషములే కాని వేరు కావు. మనకు తెలిసిన పై శక్తులకు ఒక్కొక్క పరిమిత మైన ఆవరణలు ఉన్నవి. పుట్టుక వ్యాప్తి నాశనములు కనబడుట యున్నవి. వాటి బలములు అచట ఒకట గా వ్యాప్తి కలిగి అపరిమితములు. జ్వాలా రూపంగా అవే భయంకరములు జీవ కోటికి ఉపయుక్తములు కూడ. అట్టివి మహోద్భుత శక్తులు ఇట్టి దివ్య శక్తులకు మూలమగు "విశ్వకర్మ" యొక్క బలము లేక శక్తి అనంతము అపరిమితమై యున్నది. ఆశక్తి అణువు మేరువులలో సమానమగు స్థాయిగా వ్యాప్తి గలది.

మనకు తెలిసిన అన్ని శక్తుల వలె ప్రత్యేక గుణము రూపము లేనిది. కాని దాని ఆవరణకు ఆది మధ్య అంతము లేనిది. అనగా అది సర్వ వ్యాపకము. అద్వితీయము వేరే పదార్థం లేని అనంత ఆకాశ రూపము. పుట్టుక వ్యాప్తి నాశనము ఎరుగనిది. ఎట్టి సంబంధము లేని శాశ్వత కాలనిధి నిశ్చలము నిర్మలము ఎట్టి మాయా రూపములకు భయములకు తావులేని శాంతి నిలయము. కావున ఆ పరమాత్మ అనంత జ్యోత్స్న ఒకే ఒక నిత్య సత్యమైన వెలుగు మహాదివ్య శక్తి. ప్రజ్ఞానానుభవముననే అది అనేక చిత్ర విచిత్ర రూపముల ధరించును. అందు అనంత జీవ నాటకము కడు రమ్యముగా సాగును. చివరకు ఇది యంతయు మరల ఆ విశ్వకర్మ యొక్క దివ్య శక్తి యందే లయ మందును. ఇట్టి ఆయన ఘన ప్రజ్ఞాశక్తి మహోశ్చర్యకరంగా ఆ విశ్వకర్మ భగవానుని యందే ఇమిడి దాగియున్నది. కావున అతడు సృష్టి స్థితిలయ తిరోధాన అనుగ్రహ కర్మల నెరవేర్చగల "విశ్వకర్మ" అయినాడు. ఇంకను ఆ విశ్వకర్మ జ్ఞాననిధి. శాశ్వత సత్య స్వరూపము అయి ఉన్నాడు.

### *విశ్వకర్మ భగవానుని సృష్టి విశేషములు :-*

మనము జీవులుగా రాత్రి యందు గాఢ నిద్ర చెంది విశ్రాంతి గైకొందుము. అప్పుడు పగటి అలసటలు తీరును. నిజ బలము చేకూరును. ఆ బలమునే హెచ్చు తగ్గులు గల కార్య రూప శక్తులుగ పగటిపూట వినియోగించి పని చేయుదుము.

నిజబలమునకు మించి పగలు ఎప్పడు పని చేయలేము. ఈ రేయింబవళ్ళు ఆ మహాదేవుడు నిజశక్తిని తన నిజ సంతానమగు మనకు కల్పించిన అవకాశము. ఇది ఒక అద్భుతమగు ఆ దివ్య శక్తి ఘన ప్రజ్ఞను విశద పరచు గొప్ప సృష్టి విశేషము. ఈ రాత్రి పగలను ప్రాపంచిక కాల విశేషములు కాని పురుషుడగు ఆ విశ్వకర్మ భగవానుని నిజ మహాశక్తి విశ్లేషణములు గా గుర్తించి తెలిసికొన నగును చూడుడు. మన భూమి గాలిలో తిరుగు చున్నది భూమి పైన చెట్లు, జీవకోటి నిలబడి యున్నవి. న్యూటన్ మహాశయుడు "భూమి ప్రతి వస్తువును తన వైపునకు లాగి పట్టుకొను గురుత్వాకర్షణ శక్తి కలిగి ఉన్నదని నిరూపించినాడు" అట్లే ఆర్కిమెడిస్ అను మరొక శాస్త్రవేత్త నీటియందు పడవలు తేలియాడుటకు గల ప్లవన సూత్రము అనగా నీటి యొక్క బల విశేషములను సిద్ధీకరించినాడు.

ప్రకృతి యందలి అల్ప విషయ జ్ఞానమే అనంత విశ్వమందు రహస్యముగనున్న శక్తులను శోధించి గుర్తించుటలో సహాయ పడునను సత్యము విశద మగుచున్నది.

మానవునకు వలె ఆ మహాదేవునకు కుడా నిజశక్తి ని సర్వత్రా సమాన బలమున సర్వవ్యాప్త మొనరించి ఏ పనియు చేయక స్థిరముగ విశ్రాంతి గైకొను కాలమున్నది. కాల రాత్రిగ నిలచిన ఆ కాలము (ఆయనకు మనకు ఏర్పడిన రాత్రిని నిలచిన ఆ కాలము) ఆయనకు మనకు ఏర్పడిన రాత్రిని పోలును. ఆ కాల పురుషుడు అటు పిమ్మట తన ప్రజ్ఞను ఉపయోగించుచు అద్భుత భౌతిక ప్రపంచమును, జీవులను కల్పించినాడు. లీలా వినోదియై యున్నాడు. అది ఆయన చేయు గొప్ప రిమోట్ కలర్ టి.వి వంటిది. రిమోట్ మాత్రం ఆయన దగ్గరే వుంటుంది. దానిని మాత్రం ఎవ్వరూ తమ చేతికి తీసుకొన లేరు. ఇంకొక విధంగా చెప్పాలంటే మానవుడు శిల్పి తయారు చేసిన రోబోట్ వంటివాడు. ఈ విచిత్ర విశ్వ ప్రదర్శన అత్యద్భుత మైనది. ఇక కొంత కాలము లో ఈ సమస్త జగ[illegible] ప్రభువు మాయము చేయును.

ఈ సృష్టి యొక్క ప్రమాణము. పది పక్కన ముప్పది సున్నాలు ఉంచిన ఏర్పడు సంఖ్యకు సమాన మగు అవ్యాయము సంవత్సరములని శాస్త్రజ్ఞులు తెలుపు చున్నారు. ఇట్లు ఆ మహాశక్తి పని చేయు పూర్తి కాలము ఆయనకు మన వలె ఒక పగలు కాలమే స్వరూపముగా గల విశ్వకర్మ భగవానుడు విశ్రాంతి గైకొను కాలమునకు కాల రాత్రి అనియు కల్పించు కొని పని చేయు పగటి కాలమునకు కల్పమనియు వేదము పేర్లు పెట్టినది.

నరుడు గాఢ నిద్ర నుండి లేవకున్న వాని గతి ఏమగును? వానికి ఎట్టి వ్యక్తిత్వము ఏర్పడును ? మరియు ప్రకాశించ లేడు. అతడు కోమాలో ఉన్నను చచ్చిన వానితో సమాన మగును, అప్పుడు వాని జీవితమే నిరర్థకమగును. అట్లే కాల రాత్రి నుండి విశ్వకర్మ శక్తి మేల్కొని కల్ప మందు పని చేయని యెడల ఆ మహాశక్తి యందలి సృష్టి, స్థితి, లయ తిరోధాన, అనుగ్రహ శక్తులు వాటి మహద్వి శేషములు, మహాత్మ్యములు, వైభవోన్నతులు, ఆదివ్య శక్తి యొక్క ఘన ప్రజ్ఞాన లీలలు తెలియబడ సాధ్యము కాదు. అనంత గాఢాంధకారమే సర్వత్రా శాశ్వతముగా నిల్చియుండును. కనుకనే ఆ విశ్వకర్మ పరమాత్మ తన ఘన ప్రజ్ఞను విశద పరచుకొను కాలరాత్రి, కల్పము అను కాలస్థితులను చక్రరూపమున శాశ్వతముగ తాల్చుచున్నాడు. అనగా విశ్వకర్మ కాల స్వరూపుడని తెలియనగును. ఆ మహాశక్తికి లింగ భేదము లేదు. కాని సృష్టి లో లింగభేదములు కన్పించు చున్నవి. కనుక ఆ అద్భుత శక్తి ని అతడు లేక ఆమె లేక అది అని సంబోధించ నగును. మనకు రేయింబవళ్ళు పన్నెండు గంటల కాలముతో యించు మించు సమానములు.అట్లే కాల రాత్రి కల్పముల కాలములు ఒక్కొక్కటి సుమారు 432 కోట్లు సంవత్సరములుగ వేదము నిర్ణయించినది.

ఇచ్చట మన శాస్త్రజ్ఞులు నిర్వచించిన మరియొక ప్రకృతి రహస్యమును గుర్తింతము, శక్తి అనునది అచలము, చలము అను రెండు స్థితులు కలిగి యుండును

ఏ పనినైనను చేయుటకు నిల్వ చేసిన మూలధారమగు అచల పూర్ణ శక్తి రూపమును స్థితి శక్తి (Protential Energy ) అందురు మనము రాత్రి పూట పూర్తి విశ్రాంతి పొంది మనంతట మనము సంగ్రహించుకొని నిల్వ చేసుకొను నిజబలమే మనకు స్థితి శక్తి యగును. ఈ బలమునే మనము వ్యక్తిపరముగ పగలు అనేక పనులలో వినియోగింతుము. ఇట్లు వినియోగ రూపమున ఉన్న మన నిజబలమునకే చరించునదిగా గతి శక్తి (Kinetic Energy ) అని ఆధునిక శాస్త్రజ్ఞులు ప్రత్యేకముగ పేరిచ్చిరి.

పూర్ణ వినియోగమున ఉన్న గతిశక్తి బలము స్థితి శక్తి బలమును దాటి పోలేదు. రెండునూ సమాన బలమునే సాగుట ప్రకృతి నైజము. దీనినే (Consevation of Energy )నైజమని అందురు. ఇట్లు విశ్వకర్మ నామక ఆదిశక్తి యొక్క నిజ కాలరాత్రి కాలమున స్థితిశక్తి లో ఉండును. అనగా ఆ ఆదిశక్తి యొక్క మహాశక్తి కి తరుగు, విరుగు, పెరుగుదలలు ఉండనేరవు.

కాలరాత్రి స్వరూపమునకు సరియగు గుర్తు గుండ్రని చుక్క ( • ) చుక్క అనంత ఆకాశ రూపమునకే గుర్తు. అందు ఈపూర్ణ రూపము అణువు మేరువులలో దాగి యున్న ఆ మహాదేవుని అప్రమేయ అనంత మహా దివ్య శక్తి స్వరూపమును సంపూర్ణముగ నిర్ణయించునదే గుండ్రని చుక్క వంటి నల్లని ఆకాశము. ఇది ఆ విశ్వకర్మ పరమాత్మ యొక్క సత్య ప్రతి బింబము మాత్రమే అగును. ఈ చిహ్నము ఆది, మధ్య, అంతము లేని నిరాకార, నిర్గుణ పరబ్రహ్మను పరిపూర్ణముగ విశద పరచును, తెలియరాని భగవంతుని అవ్యక్త రూపమున మానవ ప్రజ్ఞకు, ఊహకు ఆయన ప్రసాదముననే స్పష్టముగ అందిన వ్యక్త దివ్య స్వరూపమే ఈ పూర్ణాంక రూపము. ఆ విశ్వకర్మ - మహాదేవుడు. మన లను సృష్టించినాడు, పోషించి పాలించుచున్నాడు. ఆయన మనకు జ్ఞానదాత, మాతా పితృ స్వరూపము, గురువు, ప్రభువు, సమస్తము అతడే. వనిని వాని సృష్టి కార్యములను తలచుచు భక్తిని వానిని సేవించుట మనవిధి. కనుక వాని రూపమును మనకు వేదము ప్రతి నిత్యము ఎట్లు జ్ఞప్తికి తెచ్చుచున్నది గ్రహింతము.

మన వేద సంస్కృతి లో మనము ఏ ఒక్క కార్యము చేయ బూనినను దానికి ముందుగ దేవుని స్మరింతుము నిత్య దేవతార్చనల లోను, దైవ పూజలయందును, వ్రతముల నాచరించు నపుడును విధిగ సంకల్పమును చెప్పకొందుము. అనగా ఆ దేవాది దేవుని విశ్వకర్మ వంశము వారు ఓం విశ్వకర్మణే స్వాహా, ఓం సనాతనాయ స్వాహా, ఓం జగన్మయాయ స్వాహా అనియు సర్వులు ఓం కేశవాయ స్వాహా, ఓం నారాయణాయ స్వాహా ఓం మాధవాయస్వాహా అనుచు ఆదేవుడు ధరించు మొట్టమొదట మూడు ముఖ్యరూపములను స్మరించుచూ ముమ్మారు ఆచమనము చేయుదురు.

"విశ్వకర్మ" అనునది మనలను సృష్టించి ప్రోచు కరుణామయుడగు మను వంశ మూల పురుషుని దివ్యశక్తియగు ఆదిశక్తి యొక్క నిజరూపమునకు పేరు. అదే కాలరాత్రి అనునది కూడాను, మను, మయ త్వష్ట శిల్పి విశ్వజ్ఞ అను ఆది, పరా. ఇచ్ఛా, క్రియా, జ్ఞాన, మహాశక్తుల ప్రోవునకు అది మంత్ర శబ్ద సంకేత రూపము. సృష్టి స్థితి లయ తిరోధాన అను గ్రహ శక్తులకు పుట్టినిల్లు. మిగిలిన నామములు సృష్టియందు తాల్చు గొప్ప వంశవృక్ష మందలి రహస్య రూపము లను వరుసగా చిత్రంచును. ఈ విశ్వకర్మ రూపముననే "ఓం" అను ఏకైక దివ్యశక్తి రూపమున సర్వకాల సర్వత్రా వ్యాప్తియై సత్య శబ్దమునకు సంకేతమై నిలుచున్నాడు. ఓం అనునదే విశ్వకర్మ నామక భగవానునికి దివ్య శబ్దరూప మహామంత్ర రాజము. సర్వ లోకమునకు మూల పురుషుడుగా సర్వ శబ్దములకు కంఠముగా ఓంకార రూప అక్షరము దేవదేవునిగా వేదము గుర్తించినది.

---

మానవుడు రాత్రి గడవ గాఢ నిద్ర నుండి తనకు తాను మేల్కొనుచు అంతట వాని శరీరమున గల సర్వేంద్రియములు వివిధ రూప జ్ఞాన తరంగ శక్తులలో చలించ మొదలిడును. వాడు అనేక విధములగు చిత్ర విచిత్రములైన పనులు గొప్పవగు దశేంద్రియముల సహాయమున రకరకముల చలన శక్తులలో మనసు, జ్ఞానము కలిగి బుద్ధిని ఉపయోగించి చేయును. అట్లే కాలరాత్రి యను పేరుగల భగవంతునకు- పూర్ణ గాఢ యోగనిద్రా కాలము తీరగనే కాల పురుషుడగు ఆ మహాదేవుడు జ్ఞానానంద మాత్రుడై తనంతట తాను జ్ఞప్తియను.

గతిశక్తి (Kinetic Energy ) లో పడును. అనగా ఆ విశ్వకర్మ భగవానుడు సృష్టిచేయ మొదలు పెట్టును. ఆ శక్తి నే చిచ్ఛక్తి లేక ఘన ప్రజ్ఞానము అందురు. దాని ప్రభావమున నిర్మల కాల రాత్రి గర్భమందలి ఒకే శక్తిలో పలు విధములుగా చలనములు లేక కదలికలు శక్తి తరంగములు లేచును. అవియే ఆ పరశివుని ఆనంద తాండవ తరంగములు. అవి అమిత ఆనందములు సక్రమములు అత్యద్భుత శక్తి వంతములు.

అట్టి క్రమబద్ధమైన ఒత్తిడులు, నొక్కిళ్ళచే కాలరాత్రి గర్భమందు అత్యధిక పీడన శక్తి గల ప్రదేశములు వాటి తో వానిని చేరియే అత్యల్ప పీడన శక్తి గల ప్రదేశములు తప్పక ఏర్పడును. అందలి శక్తులను ఆంగ్లములో(High and low potential energy లు అందురు) అత్యల్ప పీడన శక్తి తో కూడిన ప్రదేశమునే ఆకాశము అని వేదము వక్కాణించినది.

అలల పీడనల మధ్య గల ఇట్టి ఆవరణలు క్రమముగ ఏకమై అల్ప పీడన ప్రదేశము అనంతముగ పెరుగును. అట్లు కాల రాత్రి మహోద్భుత శక్తి నుండి అత్యల్ప పీడన శక్తిగా అనంతా కాశము ఆవిర్భవించినది. ఆదిశక్తి ప్రథమమున ప్రసవించిన మహా భూతమే అనూహ్యా ఆకాశము (శివుడు) ఆదిశక్తి అనంత ఆకాశ రూపధారి అయినది. ఆకాశము శూన్యము కాదు. అందుండి విద్యుచ్ఛక్తిని పొందవచ్చునని ఆధునిక శాస్త్రము చెప్పచున్నది.

కాల రాత్రి చివరి కాలమున దాని చిచ్ఛక్తి ప్రభావమున దానిలో నే అత్యధిక, అత్యల్ప పీడన శక్తి గల ప్రదేశములు ఏర్పడుటచే అందు(విష్ణువు) పరా శక్తి రూపమైన సుడిగాలులు సహజముగ అనంత సంఖ్యలలో బల భేదములతో విజృంభించును. ఆదిశక్తి యందలి శక్తి అంశలు (పరాశక్తి) సుడిగాలి త్రిప్పబడి పోగుపడి ఓం కార శబ్దము (నాదము) తో పైకి లేచును. కాని ఊర్ధ్వ కోణమున అత్యంత సూక్ష్మశక్తికి సంబంధించిన అంశలు కుదింపబడి కుదింపబడి కుదింపబడి శక్తి బిందువులుగా రూపొందును. ఇట్లు కేంద్రీకృతమైన "బిందు" అంశారూపముగా ఊహించవలయును. ఈ బలభేధములతో కూడి పరాశక్తి బిందువుతో సృష్టికి అవసరముగు పలురకములగు అణువులైనవి. అవియే అణు విద్యుదయ స్కాంతాది శక్తులు "పంచభూతములు" పుట్టటకు బీజములైనవి.

ఇట్లు అనంతముగా లేచు పరా శక్తి తో కూడిన సుడిగాలులలో చలన శక్తి (విష్ణువు) రెండు (శంఖుచక్ర) రూపములు దాల్చుట స్పష్టము. కాలరాత్రి యందలి కనపడని అత్యంత సూక్ష్మ రేణువుల అంశలు ఈ గాలి లో దిగువ భాగమున తమచుట్టూ తాము బొంగరమువలె చక్రాకారమున గిర్రున తిరుగును. ఇవి శక్తి తరంగ రేణువుల చక్రము వలె స్పష్టముగా రూపొందును. ఈ చక్రమునకు సుదర్శనము అని వేదము పేరిడినది. సృష్టిలో ప్రప్రథమమున ఋషుల దృష్టికి ఈ రూపము చక్కగా అందుటచే దానికి సుదర్శనము అను పేరు కలిగినది. నిరాకారుడగు విశ్వ కర్మ యందు రూపమేర్పడి ద్వంద్వభావము ఉదయించినది.

సుడి గాలులు శబ్దము చేయుచు పైకి లేచి కేంద్రీకరించు ఒక అద్భుత సహజ క్రియయందలి ప్రత్యేక శబ్ద చలనమునే శంఖరూప చలనమందురు. శంఖు, చక్ర గమనముల వలన వృద్ధి చెందునట్టి విస్పష్ట అండబిందు రూపమునే ఆదిశక్తి దివ్య పశ్యంతి రూపమందురు. ఆదిశక్తి పశ్యంతి, మధ్యమ, వైఖరీ అను రూపములు మూడింటి లో సకల సృష్టి కనిపించును. అందు మొదటిదే పశ్యంతి అనునది లోకమున ఒక తల్లి గర్భమును దాల్చుటను ఇది పోలును. ఇట్టి వాతావరణములో ఏర్పడిరాలు సూక్ష్మాణు శక్తి బిందువులకు కూడా శంఖ చక్ర రూపములతో రెండు గమనములు శబ్దములు. మరల మరల తప్పవు. ఈ బిందువులే అత్యాశ్చర్య కరముగ అమిత శక్తి ని కుదింపబడి కుదింపబడి, న్యూట్రానులు ప్రొటానులు, ఎలక్ట్రానులు అను శక్తి బిందు భేద రూపములుగా విడివిడిగా ఏర్పడును. న్యూట్రాను ప్రోటాను కలిపి ఏకమై న్యూక్లియస్ అను స్థావర లేక అచల శక్తి గా నిల్చియుండు సూక్ష్మ బిందువులగును. వాటి చుట్టును చలన శక్తిగ ఎలక్ట్రానులు పరిభ్రమించ మొదలిడును. ప్రోటాను ఎలక్ట్రానులు సమాన సంఖ్యాబలములో వృద్ధిని బట్టి ఏర్పడినవే అసంఖ్యాక మూలకములు అను పదార్థములు ఒక ఎలక్ట్రాను ఒక ప్రోటాను గల న్యూ క్లియస్ సంయోగమున ప్రప్రథమమున ఉదజని వాయువు (Hydrogen) పుట్టినది. అటు పిమ్మట పదహారేసి బిందు శక్తులతో ప్రాణవాయువు జనించినది. తరువాత వాయు, ద్రవసకల మూలక ద్రవ్యములు ఉద్భవించినవి. ఈ సంగతులన్నియు ఆధునిక జ్ఞానశస్త్ర నిర్ధారితాంశములే.

ఇట్లు గా మొట్ట మెదట తయారైన ఉదజని వాయువు యొక్క అనంత సూక్ష్మాణువుల యొక్క శంఖు, చక్ర రూప అనుపరిమిత చలన వేగముల రాపిడిచే హీలియమ్ వాయువు దానిచే "అగ్ని" (బ్రహ్మతత్వము) జ్వలించును. అగ్ని రసాయనిక మార్పులకు నాంది పలుకును. అందు వలన ఉదజని, ప్రాణవాయువుల పరమాణువులు సంధించు కొని "నీటి ఆవిరి" (ఇంద్రావరణము) అను క్రొత్త అణువులను నెలకొల్పును, పిమ్మట రకరకముల మూలక ద్రవ్యములు అగ్ని దీప్తి చేత రసాయనిక మార్పులకు లోనగును. ఫలితముగా వివిధ నామములతో పిల్వబడు లెక్క లేని ఆమ్లములు, క్షారములు, లవణములు మొదలగు ద్రవ్యరాశి తో కూడిన సూర్యకుటుంబము "భూమాత" (సూర్యతత్వము) వెలసినది. అది ఆదిశక్తి విశ్వకర్మ యొక్క ఒక ప్రత్యక్ష ఘనరూపమే ఎందుచేత నంటే సృష్టి కార్యమునందు నిమిత్తో పాదానములు రెండునూ తానే అయి ఉన్నాడని వేదము తెలిపినది. భూమి యందు నీటియందు భూసార గుళికలు గా అన్నము ద్వారా జీవకోటి యందు బీజములుగా చేరి జాతి ఉత్పత్తి కారణములగును. ఇట్లు ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను పంచభూత పదార్థములు అనంత రూపములలో.

ఒకదాని నుండి ఒకటి సక్రముగా ఆవిర్భవించి సకల లోకములను ఆక్రమించును. ఇదియు వేదము వివరించిన సత్యమే.

నానావిధ వికారములతో గూడిన (సృష్టి) జీవుల పుట్టుకలకు ముందు దేవుడు అనగా విశ్వకర్మ పరమాత్మను సృష్టింప వలెననెడి కోరిక కలిగినది. ఈ విధమైన కోరిక కూడ దేవుడన్న వానికి కలుగ కూడదు. అయితే అట్టి కోరిక ఎందుకు కలిగినది అనగా పూర్వ కల్పమున గల జీవుల యొక్క సూక్ష్మ కారణ దేహము లందు వారు వారు చేసుకోన్న అవిద్య, కామ, కర్మ, సంకల్పాదులు బీజభూతములుగా ఉన్నవి.

అవియే జగవృక్షము కలుగుటకు బీజభూతములు వంటివిఅయినవి. ఆ బీజమునే రేతస్సని వేదమంత్రము సూచించినది (ఋవేమం 10 సు. 81 మంత్రము4) రేతస్సనగా పురుష బీజము. అది శరీరము జననమునకు ఎట్లు కారణమగు చున్నదో అతి పూర్వసృష్టియందలి జీవుల అవిద్యా కామ కర్మ లనెడి రేతస్సు గూడ జగత్ సృష్టికి బీజమగుచున్నదని తత్వజిజ్ఞాసువులు ఎఱుంగదగిన రహస్యము. అంతియేకాని పరమేశ్వరుడు స్వయముగా తనకు తాన్తై సృష్టేచ్ఛను కలిగించుకొనరాదు. అట్లు కలిగించు కొన్నచో అతడు కూడ సామాన్య జీవులకు వలె కామ సంకల్ప సహితుడే అగును. కాని సర్వ స్వతంత్రుడు, సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు కాలేడు అట్టి సంకల్ప సహితునకు జీవత్వమే ఏర్పడు చున్నట్లగును. కాని ఈశ్వరత్వము సిద్ధము కాదు.

సత్యజ్ఞానాంతమగు ఇట్టి బ్రహ్మము నుండి నామరూప విధములైన ఆకాశము వాయువు, అగ్నీ, జలము, భూమి అందుండి ఓషధులు వాటినుండి అన్నము దాని నుండి (రేతస్సు) పురుషుడు పుట్టినాడని తైత్తరీయానందవల్లి తెలుపుచున్నది. ఇచ్చట ప్రాణులు పుట్టుకకు కారణమైనవి. ఆకాశాది పంచభూతములే వారికి అన్నాదులైన భోజన పదార్ధములను సిద్ధము చేసినవి కూడ ఆకాశాదులే. పంచ భూతముల యొక్క సమ్మేళనమువల్లనే సృష్ట్యాది కార్యములు కొనసాగుచున్నవి. సృష్టి కార్యము జరుగుటకు పృథ్వీ భూతము. అందుకనియే ఉపనిషత్తు పృథివి నుండి ఓషధులయు అన్నము యొక్కయు సృష్టిని చెప్పినది. సృష్టింపబడిన చరాచరములు జీవించుటకు నీరు మూలాధారము.నీరు యొక్క ప్రాధాన్యము సృష్టిక్రియ కెంతముఖ్యమో

పోషణమునకు అంత ముఖ్యము. పృథ్వినుండి పుట్టిన అన్నము తిన కున్నను నీరు త్రాగి ప్రాణులు కొంత కాలము జీవింప వచ్చును. అందుకే నీరు ప్రాణాధారము అన్నమాట పుట్టినది. నీటి ప్రాధాన్యమును వేద సూక్తముల ప్రమాణముతో కూడి యున్నవి. ప్రాణులు తిన్న అన్నమును జీర్ణింప జేయుటకు అగ్ని అవసరము కనుకనే దీనిని జఠరాగ్నిఅని పేర్కొన్నారు. అనగా తిన్న దానిని జీర్ణము (నాశము) చేయుటకు అగ్ని ప్రధాన మగుచున్నదన్న మాట. కాగా పుట్టుటకు పృథివియు, పోషణకు (పాలనకు) జలమును, నాశనమునకు అగ్నియుకారణములని తెలియుచున్నది.

భౌతిక సృష్టి స్థితి లయములనెడి కార్యములకు పృథ్విజలాఅగ్నులు కారణములగు చున్నవని గ్రహింపవలసి యున్నది. ఈ మూడు కార్యములు కంటికి కనపడు చున్నవి. మన కంటికి కనపడకుండ మరి రెండు కార్యములు జరుగుచున్నవి. అవి యే తిరోదానము, అనుగ్రహము అనునట్టివి. మరణము పాలైన స్థూలశరీరములను అగపడకుండ ప్రకృతిలో లీనము చేయుటకు ఒక భూతము తోడ్పడు చున్నది. అదియే వాయువు. అటు పిమ్మట తిరోధాన మొందిన పదార్థముతిరిగి పరమాణు రూపము నుండి బృహద్రూపముగా పరిణమింప జేయు క్రియనే అనుగ్రరుని వేదాంత శాస్త్రము చెప్పచున్నది. ఇది ఆకాశ భూత సాధ్యమైనపని. మరణించిన ప్రాణులు స్వర్గాదిలోకాంతముల కేగి పాపపుణ్యముల, ఫలితములను భవించి మరల మేఘములందు చేరి అట నుండి వాన నీటి ద్వారా భూమి మీద పడి ఓషధులలో ప్రవేశించి అటనుండి పురుషుని వీర్యమున చేరి స్త్రీ గర్భమున ప్రవేశించి స్థూలశరీరము నందుచున్నారని ఛాందోగ్యోపనిషత్ లో పంచాగ్నివిద్య వర్ణించుచున్నది. ఇట్లు ఆకాశాదులైన పంచభూతములు సృష్టిస్థితి, లయము, తిరోధానము అనుగ్రహము అనెడి పంచకృత్యములకు మూలములని తెలియుచున్నది. ఈ కర్మనాచరించు నదియే విశ్వకర్మ నామక శక్తి స్వరూపమని గ్రహించ వలయును.

విశ్వకర్మ నిర్మిత విచిత్ర విశ్వభౌతిక పదార్థము వినాశం లేనిది కాదని అయితే దాని జీవిత కాలము అవ్యాయము అనగా పది ప్రక్క ముప్పది సున్నలున్న సంవత్సరాలు అయి ఉండవచ్చునని రోమ్ నగర భౌతిక శాస్త్రజ్ఞుల అభిప్రాయము (ఆంధ్రజ్యోతి 20.6.85) దీనిని బట్టి కూడ ప్రకృతి శాశ్వతమైనది.
కాదని తెలియుచున్నది. మహిమాన్విత విశ్వకర్మ నామక దివ్యశక్తి ఒక్కటి మాత్రమే శాశ్వతమైనది. అదియే అక్షర పరబ్రహ్మము.

విశ్వాంతరాళములో గుండ్రంగా తిరుగుతూ నెమ్మదిగా కదులుతున్న ఒక హైడ్రోజన్ మేఘం ఇప్పడిప్పడే ఏర్పడుచున్న ఒక పాలపుంత (గేలక్సీ) కావచ్చునని నక్షత్రాలను, గ్రహాలను ఏర్పరచగల శక్తి ఈ గేలక్సీకి వుండివుండవచ్చునని అమెరికన్ పరిశోధకులు విశ్వసిస్తున్నారు. విశ్వములో పాలపుంతలు ఇంకా ఏర్పడుతూనే వున్నాయని వాటి ఆవిర్భావం ఏ ఆదికాలానికో మాత్రం పరిమితం కాదని ఇప్పడే పాలపుంతను కనుగొనడం వల్ల తొలిసారిగా విశదమగుచున్నదని న్యూయార్కులోని కొర్నెల్ యూనివర్శిటి ఇంకా ప్యూర్టోరికోలోని అరెసిబో రేడియో టెలిస్కోపు పరిశోధకులు పేర్కొన్నారు.

సుమారు 1000 నుంచి 2000 కోట్ల సంవత్సరాల క్రితం విశ్వం ఆవిర్భావానికి దోహదం చేసిన బిగ్‌బ్యాంగ్ (హైడ్రోజన్ మేఘం) విస్ఫోటనం జరిగిందని తర్వాత కొలది కాలానికి గేలక్సీలు (పాలపుంతలు) ఏర్పడాయని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. ఒక్కొక్క గేలక్సీకి సుమారు 1000 కోట్ల నుండి10,000 కోట్ల వరకు నక్షత్రాలను కలిగి ఉండే ఈ గేలక్సీలు హైడ్రోజన్ మేఘం నుండి రూపొందాయి. ఈ హైడ్రోజన్ మేఘాలు క్రమేణా ఘనీభవించి నక్షత్రాలు, గ్రహాల ఏర్పటుకు దోహదం చేసాయి.

కాగా అమెరికన్ పరిశోధకులు ఇప్పడు విశ్వంలో కొత్తగా కనుగొన్న హైడ్రోజన్ మేఘం అండాకారంలో ఉన్నది. ఇది తనచుట్టూ తాను తరగడానికి సుమారు 1000కోట్ల సంవత్సరాలు పడుతుందట. ఈ మేఘం వ్యాసం పాలపుంత వ్యాసం కన్నా 10రెట్లు పెద్దదిగాను, దీని ద్రవ్యరాశి సూర్యుని ద్రవ్యరాశి కంటే 200 కోట్లు రెట్లు అధికంగాను ఉన్నట్టు శాస్త్రజ్ఞులు తెలిసికొన్నారు.

ఇట్లు కాలమేఘమని యెడి హైడ్రోజన్ మేఘము బ్రహ్మాండ పిండ మధ్య భాగమందలి "శివ" నామక మహాశక్తి విడివడి కోటాను కోట్లపాల వెల్లులు లేక పాలపుంతలను జ్యోతిర్లింగ ములుగా బయటకు క్రక్కును. వాటి సంఖ్య అనంతము. ఒక్కోటి ప్రారంభమున నోరు పగిలి తెరుచుకొన్న ఆ అండము నుండి బయట పడుటలో దాని ఆకారము కుదింప పడును. దీపావళి చిచ్చు బుడ్డి వలె చీదుకొని మధ్య విస్తరించును. చివరకు ఉధృతము తగ్గిపోవ చేప తోకవలె సన్నబడును. ఆ జ్యోతి పూర్తిగ వెలవడి మత్స్యరూప ఆకృతిని దాల్చును. సూర్యుని నుండి వెలువడు మహాజ్యోతి వలె పాలవెల్లుల పుట్టుకల అనంత కాలమున సాగుచుండుట సత్యము. ఇట్టి పాలపుంతలు ఇప్పటికి నూరు వరకు మాత్రమే లెక్కింపబడినవి

పాలవెల్లియే "విష్ణు" దేవుని మత్స్యరూపక చలన శక్తి ప్రథమ అవతారమైనది. ఇదియే విష్ణుదేవుని మత్స్యావతారగాథయైనది. అప్పటి నుండియే ప్రాపంచిక వేదవిద్య వికసించిన దాని గ్రహింపవచ్చును. అందుకనే డా. కొండూరు వీరరాఘవాచార్యులు గారు ఋగ్వేద దిగ్దర్శనములో ఇలా అన్నారు.

**శ్లో॥. మయం నీలోత్పలా భాసం**
**వేదశాస్త్ర ప్రకాశకం!**
**పురాణ జనకం వందే**
**కవిమాద్య మునీశ్వరమ్!!**

ఈ అద్భుత దృశ్యమును సదా స్మరింపజేయునదే ప్రతి సంవత్సరము భారతీయులు ఉత్సాహముతో జరుపుకొను దీపావళి పండుగ అందలి అనంత కోటి దివ్యకాంతులు, టపాకాయల శబ్దములు, తారాజువ్వల జ్వాలామయ శోభలు మొదలగునవి.

పాలవెల్లువలతో పాటు శబ్ద బ్రహ్మము కూడ పుట్టి విస్తరించి వెల్లడియైనది. మననోటి నుండి శబ్దము లేక మాట వెలువడు విధము గమనించిన అందు మొదట "అ" అను శబ్దధ్వనితో నోరు విప్పాలి. "ఊ" అను శబ్దధ్వనితో ఆ మాటను విస్తరింప జేసి నిలపాలి. "మ" అనుశబ్దశక్తితో నోరు మూసి ఆ పలుకును ముగింపచేయాలి. ఈ విధముగ ఒకమాట మననోటి నుండి పుట్టివ్యాప్తిచెంది పూర్తిగా వ్యక్తమై బయటికి నెట్టవేయ బడగలదు. అదే విధముగ బ్రహ్మాండ పిండ ముఖము నుండి పాలపుంత ఒక్కొక్కటి బయటకు వెలువడు నప్పడు "అ-ఉ-మ" ధ్వనులు మొదట తప్పక చేయును "అ" పాలపుంత పుట్టుకను, "ఊ" అది నిలిచియుండు స్థితి "మ" దాని ముగింపును గుర్తు చేయును. అ-ఊ-మ్ శబ్దములు కలిసి "ఓం" కారశబ్దమగును. "ఓం" కారమే శబ్దబ్రహ్మ. ఈ ప్రపంచ సృష్టి స్థితి లయలములను సూచించు మహామంత్రాక్షరము

ఓం ఇత్యేకాక్షరం బ్రహ్మ" అనునది భౌతిక ప్రపంచకమునకు శబ్దరూపమున గుర్తు అగుచున్నది. బ్రహ్మ విష్ణు రుద్ర శక్తులకు శబ్దబ్రహ్మరూపము నిచ్చుచున్నది. ఇది ఒక మహాశ్చర్యకర శబ్దశక్తి మహామహిమాన్విత శబ్దశక్తి, మహామంత్ర రాజము. దేవదేవుడైన విశ్వకర్మ భగవానుని ప్రతిదివ్య మహిమను పొగడుటకు ముందుగా తలంచ వలసినది. ఆయన మహాశక్తికి శబ్దంరమగు ఓం కారమనే త్రిశక్తుల మూర్తియగు మహాదేవుడగు విశ్వకర్మను ఎల్లకాలముల మనసున నిల్పుశబ్ద బ్రహ్మమిదియే.

## పంచబ్రహ్మల పుట్టుక స్థానములు:-

బ్రహ్మాండ పిండమనెడి హైడ్రోజన్ మేఘము స్థితిశక్తి (శివుడు) ఆదిశక్తి యొక్క అసలు రూపము. అది శివలింగా కారమందలి పాన మట్టమును సూచించును. ఆ పిండము నుండి వెలువడు పాలవెల్లులు లింగాకారపు మహోజ్వాలా జ్యోతులే రూపుదిద్దు కొనిన మహాశివుడు. ఆ లింగాకారపు చిన్న జ్యోతులే ఆయన మేన ధరించు పన్నగములు. ఇట్టి అనంత కాంతి పుంజములతో ప్రకాశించు కల్హారంభమును తెలుపు ఉత్తరాయణ పుణ్యకాలమును సదాజ్ఞప్తికి తెచ్చునదే. మాఘమాసమందలి మహాశివరాత్రి ఉత్సవము. ఇది కోటాను కోట్ల లింగ రూప జ్యోతులు బ్రహ్మాండము నుండి ప్రథమమున ఆవిర్భవించు మహాకాలము. ప్రపంచోత్పత్తికి సమాయత్తమగు మహాసృష్టి బిందువును చిందించునట్టి మరచిపోలేని మహోమాన్విత ముహూర్తకాలము.

ఒక్కొక్కపాల వెల్లువ స్థితిశక్తి. గతిశక్తిగా మారిన మాయామయశక్తి (విష్ణువు) మేఘరూపమున మత్స్యాకృతిని అతిశయించి శంఖచక్రాకృతిని తారాజువ్వల వలె హ్రీం కారాది ఘనశబ్దములు చేయుచు అనంతాకాశము లోనికి నిరాటంకముగ అనూహ్య వేగమున దూసుకొని పోవుట తెలిసికొంటిమి. ఇట్టి ప్రతిపాలపుంత ఒకక్రమ పద్ధతిని పంచభూతముల యొక్క శక్తుల కూర్పుతో నిండి నిబిడీకృతమై గొప్ప ఒత్తిడులకు లోనగును. శంఖ చక్రరూప శబ్దభ్రమణాలతో చరించు బ్రహ్మాండ పిండము తల్లియగుటచే ప్రతి పాలపుంతకు ఈ రెండు చలనములు, శబ్దములు వంశానుగత ములగును. అది దీపావళి బాణాసంచాలో ఒకటగు వెలగ కాయవలె తనచుట్టూ తాను బొంగరము వలె చక్రగతిని తిరుగును. హ్రీం కారాది శబ్దములు చేయుచు బాణమువలె నిరాటంకముగ ముందుకు దూసుకొని పోవును. ఇట్లు తనయందు శంఖ, చక్ర గమనములు పొందును. దీని వలన దాని గర్భమందు అనేక రూపములు పొందును. దీని వలన దాని గర్భమందు అనేక రూపముల మార్పులు ఏర్పడును.

పాలవెల్లి లేక పాలపుంత యందలి శంఖు, చక్రవేగములు కలిసిచేయు ఒత్తిడులచే దానియందలి శక్తి అంశలు కుదింపబడును. అందుచే దాని నిజరూపమునే అనేక మత్స్యరూపమేఘశక్తి అంశలు చిన్నపెద్ద పిండములు గా దాని గర్భమందు రూపొందును ఇవియే ఇచ్ఛాశక్తుల (బ్రహ్మ) స్థానము. అణుశక్తి అని పించవలయును. అవి అణుశక్తిని వృద్ధినొందుచు ఒకదానినొకటి ఆకర్షించుకొను చుండును. వాటి మధ్య మరల అల్పపీడన శక్తి గల క్రొత్తఆకాశ అంతరిక్షరూప (ఇంద్ర) క్రియా శక్తి రూప మేర్పడును. పాలవెల్లిలో పుట్టి రూపొందిన ఈ మత్స్యరూప అణుశక్తి అంశలు బొంగరము వలె తమ చుట్టు తాము తిరుగుచు చాపవలె చుట్టచుట్టుకొని పోవును. ఈ స్థంభాకృతులు ముందుకు దూసికొని పోవు ఆది పరా ఇచ్ఛా, క్రియా శక్తి వలన అత్యధిక సాంద్రతతో కుదించుకొనిపోయి గోళాకారములను పొందును, పాలవెల్లిలో రూపొందిన ఈ గోళాకృతులే నక్షత్రములు కుదించుకొని పోయిన నక్షత్రమంలి (సూర్య) జ్ఞాన శక్తి నాలుగు వలయములు కలిగి బ్రహ్మాండ పిండమునే పోలి నిల్చియుండును. ఇంకను కుదించుకొని పోవశక్తి చాలదు. బ్రహ్మాండ పిండములో వలె వాటి మధ్య వలయమందలి అత్యధిక పీడన శక్తి మిగిలిన అల్పపీడనశక్తి ప్రవేశముల ద్వారా ఆకాశము లోనికి మరల వెనుకకు జ్వాలా రూపముల క్రమపద్ధతిని తన్నుటయు సత్యమగును. నక్షత్రముల నుండి ప్రప్రథమమున వెలువడిన మహాజ్యోతులే వాటి గ్రహములుగను భూమండలములు గను మార్పు చెందును. ఈ గ్రహముల నుండి అదే విధమైన చంద్రులు దయింతురు. మిగిలిన శక్తితో ప్రకాశించు నక్షత్రము (ఒక సూర్యుడు) గా ప్రవర్తించును. ఆ పిమ్మట సూర్యులనుండి వెలువడు జ్యోతులు ఆకాశములో లీనమగును. / ఆ సూర్యుడు తత్సంబంధ గ్రహములు భూమండలములు చంద్రులు కలిగి ఒక సూర్యకుటుంబ మగును.మనకు ఎంతో దూరము నుండి కనిపించు ప్రతి నక్షత్రము ఒక సూర్యకుటుంబమే ఈ కుటుంబములోని సభ్యులెల్లరకు వంశానుగుణంగా శంఖు, చక్రగమనములు శబ్దములు తప్పవు. అది ఒక్కొక్కటి తనచుట్టూ తాను తిరుగుచు ప్రత్యేక ప్రత్యేక కక్షయేర్పరచుకొని తమ మాతృమూర్తులకు ప్రదక్షిణములు చేయుచుండును. అట్లు చేయుటలో ఒకదాని నొకటి ప్రత్యేక ఆకర్షణ వికర్షణశక్తులతో తమ తమ క్షేమములను అవి సాధించుకొనుచు ఈ నడకలు మన భూమికి ఇతర గ్రహములకు వాటి చంద్రులకు అనగా ఉపగ్రహములకు ఉన్నట్లు మనకు తెలిసిన విషయమే.

(మనకు ఎంతో దూరము నుండి కనిపించు ప్రతి నక్షత్రము ఒక సూర్యకుటుంబమే ఈ కుటుంబములోని సభ్యులెల్లరకు వంశానుగుణంగా శంఖు, చక్రగమనములు శబ్దములు తప్పవు. అది ఒక్కొక్కటి తనచుట్టూ తాను తిరుగుచు ప్రత్యేక ప్రత్యేక కక్ష్యయేర్పరచుకొని తమ మాతృమూర్తులకు ప్రదక్షిణములు చేయుచుండును. అట్లు చేయుటలో ఒకదాని నొకటి ప్రత్యేక ఆకర్షణ వికర్షణశక్తులతో తమ తమ క్షేమములను అవి సాధించుకొనుచు ఈ నడకలు మన భూమికి ఇతర గ్రహములకు వాటి చంద్రులకు అనగా ఉపగ్రహములకు ఉన్నట్లు మనకు తెలిసిన విషయమే.)

మన సూర్యుడు కూడ తనచుట్టు తాను తిరుగును. తాను పుట్టిన పాలవెల్లి కి 221/2 కోట్ల సంవత్సరముల కొకసారి ప్రదక్షిణచేయుచున్నాడు అనుటయు శాస్త్ర సమ్మతమే ఇట్లు సూర్యకుటుంబ సభ్యులెల్లరు. క్రమ శిక్షణతో ఎవరికక్షలు వారు వీడక ఒకరినొకరు ఢీకొనక నాశన మెరుగక సంఘీభావము సహకారమున శబ్ద, సంగీత రుచులతో శబ్దబ్రహ్మమున శాశ్వతముగ కట్టుబాట్లతో ఎవరి పరిధిలో వారు చరించుచున్నారు. ఇతర సూర్యకుటుంబములు, నక్షత్రములు కూడ అట్లే సఖ్యతను మెలగు చున్నవి. ప్రతి పాలవెల్లి యందలి నక్షత్రములు ఒకే ఒక కుటుంబముగ వీడగరాని సాంఘిక కట్టుబాట్లతో శాంత మార్గమున శాశ్వతముగ జీవితములు సాగించు చున్నవి. అందుకొన్ని చాల చిన్నవి బలహీన నక్షత్రములుగా తోకచుక్కలుగా తిరుగాడు చున్నవి. కొన్ని కట్టుబాట్లు తప్పిపోవుటచే ఉల్కలుగా మారి ప్రక్కనక్షత్రములో పడి అందు లీనమగు చున్నవి. ఇదే రీతిని పాలవెల్లులు కూడ అసాధారణమగు కట్టడితో సంచరించును.

ఇట్లు సృష్టియందు ఏర్పడిన అనంత కోటి పాలవెల్లువలలో ఇంత వరకు 100 వరకు మాత్రమే లెక్కింపబడినవి. వాటి యందలి నక్షత్రకూటములను చేర్చి మేషాది ద్వాదశరాసులుగ వాటిని విభజించుట జరిగినది. అందు బ్రహ్మాండ పిండమునుండి మొదట పుట్టినవే సప్తఋషులు, ఏకాదశరుద్రులు, ధృవుడు అను పేర నొప్పు నక్షత్రములు. ఇట్టి నక్షత్రకోటి పాలవెల్లువలతో కలిసి ప్రత్యేక శంఖుచక్ర రూప గమనములు, శబ్దములు కలిగి ఒకదాని నొకటి ఢీ కొనక ఆకర్షణ వికర్షణ రూప శక్తులతో లోకైక సుసంఘ భావనలతో శాంతిని నెలకొల్పుకొని శాశ్వత

రూపమున అనంత కాలము నిల్చిమనుచున్నవి. ఈ సంఘమునుకూడ ఇట్లు తీర్చిదిద్దవలె మానవుడు మెలగ వలసిన ధర్మపథమును నక్షత్ర సంఘము సృష్టి పరచును. యమునా తీరమున ఎవరికేవారే అనునది సత్యమైనను సంఘమున జీవి కట్టడులనుతప్పరాదనుట సృష్టియందలి ధర్మము. ఈ ధర్మమే దైవ స్వరూపము ఇట్టి ధర్మపథము వీడకుండుటే దైవారాధనము. సూర్యచంద్ర నక్షత్రాదులు గతులు తప్పిన సృష్టియే నాశనమగును. మానవుడు కట్లుబాట్లను వీడిన మానవ జాతి నాశనమగును.

ప్రపంచమునకు శంఖు, చక్రరూప గమనములు చలనములు శబ్దములు లేనిచో అది రూపొంద నేరదు. ఏదో విధమున అది రూపొంద నేరదు. ఏదోవిధమున అది రూపొందినను స్థిరముగ నిల్చితనను తెల్పుకొనుచు మనలేదు. బొంగరము తిరుగునంత వరకే నిలిచి యుండుట మనకు సువిదితమే. అందుచేతనే ప్రపంచ సృష్టికర్త విశ్వకర్మ, విష్ణు నామక మహాస్వరూపమునకు సుధర్శనము, పాంచజన్యము అను పేర్లతో నిల్చిమనుటకు తోడ్పడు మహాద్భుత అద్వితీయ శక్తులుగ వేదము నిర్ధారణ చేసినది. నక్షత్రాదులు మొలుకువతో సంచరించు ప్రతి కక్షరూపము కూర్మరూపమే అనగా తాబేటి ఆకారము ఈ పథమును విడిచిన ఎడల అవి ఒక నిముషమైన కట్టడిని నిల్చిమన జాలవు. అవి ఒక్కొక్కటి అనంతాకాశము లోనికి రాలి గమన వేగ బలిమిని మండి మాయము కావలసినవే. కనుకనే / సృష్టిని స్థిరముగ ఊని నిలువు కక్షయొక్క తాబేటి రూపమే విష్ణుశక్తి యొక్క కూర్మావతారగాథగా వేదము, పేర్కొనినది./ వేదశాస్త్రముల యొక్క విస్తరణకు సహకరించు మత్స్యరూపము విష్ణుశక్తి యొక్క ప్రథమ అవతారమైన భౌతిక ప్రపంచము, స్థిరముగ నిల్చిమనుటకు సహాయపడు కూర్మరూపము రెండవ ముఖ్య అవతారమైనది. భూమి కూడ ఆకాశ పథమున బొంగరము వలె తన చుట్టు తాను తిరుగుచు తాబేటి కక్షగమనము చేయుచున్నది.

మన పాలపుంత లో శాస్త్రజ్ఞులు లెక్కించిన 25కోట్ల నక్షత్రములలో మన సూర్యుడు ఒకడు 200 కోట్ల సంవత్సరములకు పూర్వము ఒక మహాద్భుత గోళముప్రేలి బ్రద్దలయింది. అందుండి ఒకశకలముగా ఘనజ్వాలా రూప

మహామేఘాకృతిని సూర్యుడు పుట్టి ఆకాశములోనికి దూసికొని వచ్చినాడు. వాని అంచులనుండి కొన్ని భాగములువెలువడి భూమి. గ్రహములుగా ఏర్పడినవి. వాటియందలి గురుత్వాకర్షణ శక్తిచే ఆ మేఘజ్వాలలు కుదించుకొనిపోయి గోళములైనవి. సూర్యుడు తనుచుట్టు తాను ఒక ఘనశక్తి తోడ్పాడుటన తిరుగుచున్నాడు. మరియు పాలపుంతలో ఒక ప్రత్యేక కక్ష ఏర్పరచుకొని 221/2 కోట్ల సంవత్సరముల కొకసారి
పాలపుంతను చుట్టి ప్రదక్షిణలు కాలించుచున్నాడు. భూమి గ్రహములు తమ చుట్టు తాము తిరుగుచు సూర్యుని చుట్టు ప్రత్యేక కక్షలో తిరుగుచున్నవి. సూర్యుని బహురూప అనంత కిరణ సముదాయము మహాకాంతి వంతము. భూమి పై జీవకోటి పుట్టి ప్రభలుటకు ప్రబల కారణభూతము. ఓషధులు పుట్టుక వ్యాప్తులకు తోడ్పడు చంద్రకాంతికి పుట్టినిల్లు.

సూర్యుని చుట్టు నాలుగు వలయములు గుర్తింపబడినవి. 1. అత్యధిక సాంద్రత కలిగిన కారు నలుపు అణుశక్తి చూపు చారరాని అంధతమిస్రమే. 2. వలయము సాంద్రత పలచబడిన అదే అణుశక్తిచేపూరించబడిన తమిశ్రరూపమే. దీని పరిమాణము సూర్యుని మొత్తం శక్తిలో 4వ వంతు మాత్రమే. ఈభాగమందలి పరమాణువులు సక్రమభ్రమణలచే ఈ వలయము ఒకగొప్ప అయస్కాంత క్షేత్రముగా ఏర్పడినది. ఈ భాగము కూడ చూడ శక్యము కాలేదు. 3వ. భాగము రెండవ భాగపు స్వయం ప్రకాశమే పసుపు పచ్చని బంగారు కాంతి. దీని బయటనున్న 4వ వలయము బహురూప అనంత కిరణ సముదాయము మహాకాంతి వంతము. భూమిపై జీవకోటి పుట్టిప్రబలుటకు కారణ భూతము ఓషధులు పుట్టుక వ్యాప్తులకు తోడ్పడు చంద్రకాంతికి పుట్టినిల్లు. ఈ భాగమును మాత్రము దుర్భిణీ సహాయమున చూడవచ్చును.

సూర్యుని మధ్య వలయమందలి అత్యధిక సాంద్రత నొప్ప మహామాన్విత శక్తి అత్యల్ప సాంద్రత గల అదేశక్తితో కూడిన రెండు మూడు వలయములను ఛేదించుకొని జ్యోతిర్లింగా కారములుగా బైట ఆకాశము లోనికి తన్నుచున్నది. కాని రెండవ వలయమందలి అయస్కాంతశక్తి మధ్య వలయమును ఒకేసారి ఈసృష్టి 432 కోట్ల సంవత్సరములు వర్ధిల్లునని వేదము స్పష్టపరచిన విషయము కూడ వేద సమ్మతమే అగును. సూర్యకిరణవిభాగమగు ఇంద్ర ధనుస్సు ( ) అను ఏడు రంగులు గల గుఱ్ఱముల పూన్చిన రథము నెక్కి సూర్యుడు తిరుగు చున్నాడనుటయు సత్యమే సూర్యుడు కదలడు అనుట అవాస్తమని తెలియుచున్నది.

## గ్రహములు -- ఉపగ్రహములు

నక్షత్రములు పాలవెల్లువలో రూపొందిన విధముననే వాటిలోని ప్రతి ఒక్కదానినుండి ఒక సూర్యుడు ఆసూర్యకుంటుంబమును గ్రహములు, భూదేవత వాటినుండి మరల చంద్రుడు పుట్టుట
గ్రాహ్యమే సత్యమే పాలవెల్లువలో ఏర్పడిన మత్స్యావ తార (మత్స్యరూప) శక్తి జ్యోతులు కుదించుకొని అత్యధిక సాంద్రత గల అణుశక్తితో నక్షత్రములైనవి. వాటి నను సరించి వాటినాక్రమించుకొని సాంద్రత తగ్గిన అల్పపీడన శక్తి రూప ప్రదేశములు ఏర్పడ పాలవెల్లి యందు మరల ఒక ఆకాశముపుట్టినది. అందుచే నక్షత్రముల వలె అత్యధిక సాంద్రతతో కుదించుకొని పోయి కేంద్రీకరించిన ప్రతిఘన అణుశక్తి మరల మహోజ్జ్వల జ్వాలారూపములతో మన సూర్యుని లోని శక్తివలె బయటకుఒక క్రమ పద్ధతిని క్రక్కుట సత్యము. అట్లు ఒక నక్షత్రము నుండి వెలువడిన ప్రప్రథమ మహోజ్వాలా రూపములే మన సూర్యుడు, గ్రహములు, మన భూమి గ్రహములు భూమి కూడా నక్షత్రముల వలె మేఘరూప మత్స్యాకృతిని వెలువడినవే. అన్నిటయందు శంఖ, చక్ర గమనములు, వేగములు వంశాను గతములై చెల్లినది. అందుచే అదియుమరల గుండ్రముగా కుదించుకొని పోయినవి. బంతివలె రూపొండినది. వాటియందలి ద్రవ్యరాసులు వేరువేరుగా నుండి వివిధ రూపశక్తి కణములకు ప్రసరించుచున్నవి. అట్లు ప్రతి ఒక్కగ్రహము సూర్యుడు తన చుట్టు తాను తిరుగును, తన మాతృ గ్రహమునకు ప్రదక్షిణము చేయును. ఇవన్నియు ప్రత్యేక ద్రవ్యరాసులు కలిగియుండుట చేతను వివిధ ఆకర్షణ వికర్షణ బలములుగల తేజోరూప కిరణ శక్తులు ప్రసరించుట చేతను వేదవిద్యను భారతీయులకు బలభేదములు గల విశ్వకర్మ భగవానుని దివ్యశక్తి స్వరూపములైనవి. వివిధ నామములు గల దేవుళ్ళయినవి. ఇవన్నియు వేరువేరు ప్రత్యేక కక్షలేర్పరచుకొని ఒకదానినొకటి ఢీకొని నశించక అద్భుతముగ ఆకర్షించు కొనుచున్నవి. అమిత భేద బలశక్తులు కలిగి ప్రతి పాలపుంత యందలి నక్షత్రములన్నియు ఒక్కోటి విడిగను సాంఘిక కట్టుబాటుననే ప్రవర్తించుచున్నవి. ఇట్టి శక్తుల ఉనికిని బాగుగా గ్రహించుట వలననే బ్రద్దలు కాకుండా అత్యద్భుత బలిమిని అదిమి పాలించుచున్నది. అందుచే మధ్య భాగపు అంచుల వద్ద అణుశక్తి కలిగి ఏర్పడు ఉదజని వాయువు

పరమాణువులు సృష్టి క్రమబద్ధమగుచున్నది. నాలుగు ఉదజని వాయువు పరమాణువులు ఏకమై హీలియమ్ అణువగుచున్నది. దీనికి బ్రహ్మాండమైన అగ్నిశక్తి, అణుబాంబు శక్తి కలుగును. ఈ అణువులు ఏర్పడు కాలము వేగములబట్టి ఆ వలయమును ఛేదించు లింగ రూప అణుమహాజ్వాలలుపుట్టుచున్నవి. ఆ జ్వాలలు వచ్చు రెండవ వలయమందలి నల్లని బిలముల రూపమే వరాహము. ఈరూపముని విష్ణువు సూర్యశక్తిని అదుపున బెట్టి లోక నాటకమును నిర్విసాగించుచున్నాడు. దానిని శాశ్వతరీతిని ఆడించి పాలించుచున్నాడు. ఇట్లు సూర్యుని మధ్య ఉన్న మహా అణుశక్తి యొక్క గొప్ప విలువలు కొంచెము కొంచెముగ కరగి కాలనియయమున ఘన జ్వాలలుగ బయటకు క్రక్కబడు చున్నవి. ఇవ 200 కోట్ల సంవత్సరములలో ఆ సూర్యబింబము విస్తరించుకొని పోయి మండిపోవును. సూర్యకుటుంబము నుండి అది అంతయు మహోజ్జ్వల జ్వాలారూపమగును.

నక్షత్రాలన్నింటికి ఇదే గతి పట్టుటను గ్రహించవచ్చును. ప్రతి పాలవెల్లువ మహోజ్యోతి గల మేఘమగును. పాలవెల్లవలన్నీ మరల ఏకమై అవి అనంతాకాశమున క్రమ్మివేయును. అనంతాకాశము విస్తరించును. కాలరాత్రిలో లీనమగును దేవదేవుడైన విశ్వకర్మ పరమాత్మ యొక్క నిజస్వరూపము కాల రాత్రి మరల ప్రకాశించును. కాలరాత్రి, కల్పములు ఇట్లు చక్రభ్రమణమున రూపొండి శాశ్వతముగ సాగును. ఇది వేద విజ్ఞానము. ఇది ఇప్పటి శాస్త్ర విజ్ఞానమును అతి శయించి యుండుట గ్రాహ్యము. వేదము వివరించిన బ్రహ్మాండపిండ భాగములు ఇప్పటి శాస్త్రజ్ఞులు గుర్తించిన సూర్యబింబ భాగములు గుణములు కొంచెము కూడ తేడాలేక చక్కగా సరిపోవు చున్నవి. సూర్యుని మధ్య వలయములు అత్యధిక సాంద్రత గల అణుశక్తి ఖనులే రెండవ వృత్తభాగములు, సాంద్రత తగ్గిన శక్తితో మధ్య భాగమందలి మహాశక్తులను అదిమిపాలించు ఆయస్కాంత క్షేత్ర స్వరూప విష్ణుశక్తులే. మూడవ వలయభాగములు రెండవ వలయముల ప్రకాశమే పసుపుపచ్చని బంగారు కాంతులే. వీటిని ఆవరించు కొనియుండు నాల్గవ భాగముఅమిత తేజోరాశితో విరాజిల్లు కిరణశక్తులు జీవకోటి సృష్టికి కారణమగు బ్రహ్మనామ శక్తులే. కనుక సూర్యుడు బ్రహ్మాండ పిండ భాగమే, దాని దివ్య సంతానమే అగుట స్పష్టము, యదార్థము. సూర్యుడు మనకు ప్రపంచమున కాన్పించు విశ్వకర్మ స్వరూపము.

వేద విద్యయందు జ్యోతి శ్శాస్త్ర మంకురించినది. ఆ శాస్త్ర రీత్యా పలువిధ శక్తులు ఆయా గ్రహములందు నక్షత్ర ములందు స్థిరపరచబడినవి. ఆ శక్తులకు మూర్తులు కల్పించబడి వాటి శక్తులను మానవుడు పొందును. అరికట్టను మంత్ర

రూప మార్గము లేర్పడినవి. ఒక్కొక్కమూర్తి యొక్క శక్తి ఒక్కొక్క శబ్దరూప శక్తి అయినది.

ఈ గ్రహ కూటములు ఏర్పడు సమయమునకు వాటిలో నిల్చిన భౌతిక శక్తి ఎంతయో యోచింతము. బ్రహ్మాండ పిండ మందలి అనంత మహాశక్తిని కోటాను కోట్ల పాలవెల్లువలు పంచుకొన్నవి. ఒక్కొక్క పాలవెల్లువ యందలి అగణితశక్తిని మరల అనంత కోట్ల సంఖ్యగల నక్షత్రములు విభజించుకొనినవి. అట్టి నక్షత్రము నుండి మరల గ్రహములు భూదేవి పాలు పంచుకొనినవి. అనగా బ్రహ్మాండ పిండ శక్తి గ్రహములను, భూమిని చేరుసరికి అనంతానంత గుణములు క్షీణించి తగ్గిపోయినది. అందుచే కొన్ని గ్రహలకు భూదేవికి తమనుండి చంద్రులను కనునంత వరకే శక్తి నిలబడినది. చంద్రులందు ఇంక అట్టి శక్తి శూన్యమైనది. వీటి అన్నిటి లోను గల అణుశక్తి జ్వాలారూపములు వాయుద్రవ ఘన పదార్థములుగ ఉష్ణము తగ్గుకొలది రూపొందినది. అణుశక్తి యే (బ్రహ్మాకృత్యమే) అనేక మూలకములకు తల్లియైనది. మూలకములు అగ్ని (బ్రహ్మాతత్వము) ప్రభావమున రసాయనికి మార్పు చెందనది. అట్లు భూమి యందు ఏర్పడినదే రకరకముల ఆమ్లములు, ఉప్పులు, క్షారములు, రసములు, రుచులు, వాసనలు మొదలగు సర్వభౌతిక ద్రవ్యములు. వీటిఅన్నింటికి మథించగా చిక్కిన సారరూపములే పుష్ప అండ కోశమున సృజింపబడు అండ బీజములు వంటి సకల జీవకణములు విత్తులు. అణుశక్తి నుండియే విద్యుత్ అయస్కాంత శక్తులు, కాంతి లేజము, రేడియేషన్ మొదలుగ అద్భుత కిరణ, తరంగ శక్తులు ఉద్భవించినవి.
నక్షత్రములు సాపేక్ష ( ) రూపగమన శక్తులను కిరణ శక్తులను బట్టి దూరము వేగముకాలము కొలతలు తల సూపినవి. ఈ ముఖ్య శక్తులందలి ఆకర్షణ వికర్షణ శక్తిరూపములే ధన, ఋణసంజ్ఞలుగ స్త్రీ పురుష లింగ బీజములుగ మార్పు చెందినవి. కాలరాత్రియను విశ్వకర్మ నామక శక్తి ఇట్టి అద్భుత పరిణామము చెందుట మహాశ్చర్యకరము, ఆలోచనలకు అందనిది ఇట్టి విశ్వవికాశమున విశ్వకర్మ భగవానుడు నిర్గుణుడు, సగుణుడును నిరాకారుడు, ఘనపదార్థ రూపిగను మారెను. అట్టి మారురూపమున వాని దివ్యశక్తి ఆధారముననే జీవలోక నాటకమును అత్యంత రసవంతముగ కాలమంతయు ఆ చిన్మయుడు నిర్విరామముగ నిరాటంకముగ గతిశక్తిని పూన్చి సాగించుచున్నాడు. అందుచే అన్నారు పెద్దలు

**శ్లో॥ చిన్మయం వ్యాపితం సర్వ త్రైలోక్యం సచరాచరం!**
**అసిత్వం దర్శితం వ్యాప్తం తస్మైశ్రీగురవేనమః!! అని**

*భూమి :-*

విశ్వ కర్మ భగవానుని నిరాకార దివ్యశక్తి చిట్టచివరకు ఘనరూప భూమాతగా వెలసినది. మన భూమి సూర్యకుటుంబములో అతి ముఖ్యమైన గ్రహరాజము. ఆ భూమాతయే నరుని కని, పెంచి వానిని దివ్య పురుషునిగ దిద్దగల శక్తిని ప్రకాశించు దివ్యమాత. నరుని మాతలకు మాత, సర్వజీవ ఉత్పత్తి స్థితి పోషణలకు మూలకందము. ఆమెలోకమునకు ప్రభువగు దేవదేవుని మహోద్భుత వంశజ్యోతుల యొక్క ఆదర్శ జీవిత విధానములను గ్రహించి ప్రకటించి వంశోన్నతిని ఇనుమడింపజేయు వజ్ర సంకల్పము గల సుసంతానవతి. తండ్రియగు భగవంతుని మహోద్భుత జీవిత చర్యలను తపించి తెలుసుకొని ఆయన ను ప్రేమించి పూజించ నేర్చిన అసమాన ప్రతిభావంతుడే ఆమె పుత్రలేక పుత్రికారూపి నరుడు.ఇదియే భూమాత నిరుపమాన అత్య అద్భుత జీవిత ప్రభ. ఆమె స్త్రీగా మాతగా నిజ వంశగౌరవమును సాధించి నిల్వ ప్రోత్సహించగల పరమ పావని, ధన్యజీవి.

ఇట్టి మన భూమాత ఒక మేఘరూప అగ్ని జ్యోతిగ మత్స్యరూపము గల చాపవలె సూర్యదేవుని నుండి ప్రప్రథమున వెలువడిన మహాదివ్య జ్యోతులలో ఒకటి అని గ్రహించితిమి. శంఖు, చక్ర రూపగ మనములు కలిగి ప్రత్యేక కక్షలో తనను కనిన మాతా పితృ స్వరూపుడగు. సూర్యునకు నిటారుగ నిల్చి సవ్యమగు రీతిని ప్రదక్షిణలు చేయుచు గోళరూపిణియైనది. ఉష్ణత తగ్గి చల్లబడి ద్రవరూపమున మహోజ్వల కాంతితో పాలసముద్రమువలె ప్రకాశించినది. హఠాత్‌గా దాని దివ్య దైవశక్తి స్వరూపుడై వక్ర మార్గము విడనాడినట్టి. రాక్షస స్వరూపియగు ఒక మహాశక్తి వంతము. అసాధారణమగు ఒక ఉల్క మందారవర్ణ శోభితమై వెలుగుటచేరాక్షస కిరణ శక్తులు పోరాటమే సృష్టి నిల్చి సాగుటకు మిక్కుటముగా తోడ్పడుట సత్యమే. ఆ పడిన ఉల్క మందార వర్ణశోభితమై వెలుగుచే దానికి వేదము మందరగిరియని సార్థక నామమిచ్చినది ఉల్క తోకయే వాసుకియును కవ్వపుత్రాడు అయినది. ఆ ఉల్కాఘాతము వలన సూర్యునకు నిటారుగ వున్న భూమి అక్షము సూర్యునకు ఏట వాలుగ నెట్టబడినది. ఇట్టి అక్షబలిమి భూమి, ఉల్క కలిసి భూకక్షను తేలియాడి సంచరించ దొడగినవి.

విశ్వకర్మ కుమారుడైన విష్ణువు భూకక్ష్యరూప కూర్మావతారము ఎత్తి వాటిని రెంటిని ఎత్తి నశించకుండా తేల్చినాడు ఉల్కాపతన కారణమున ఒక మహోగ్ర అగ్నిజ్వాల హాలాహల రూపమున భూమి క్షీరసముద్రతలము నుండి ఉబ్బెత్తున పైకి లేచి బయటకు తన్నినది. దానిని విశ్వకర్మ సద్యోజాతముఖ సంభవుడు అయిన ప్రపంచదేహి శివుడు మ్రింగి కంఠమున దాల్చి గరళ కంఠుడైనాడు. భక్తవ శంకరుడైనాడు. శంకరుడు అనగా (పాపమును పోగొట్టువాడని) అర్థము. భూమిపైన గల జీవులను కాలకూట విషము బారిన పడకుండు కాపడిన శివుడు వారికి మహాదేవుడైనాడు. ఆ ఉల్కయొక్క మహోగ్ని భూమిపై పడి చిలుకుట వలన భూసారము ద్రవ వాయు రూపమున పైకి తన్ని లేచినది. అదే నీటి యాఖింగల తెల్లని మహామేఘము అనుఐరావతము ఆ ఐరావతము విశ్వకర్మ కుమారుడైన (తత్పురుషము భోద్భవుడు) అంతరిక్ష స్వరూపుడు వర్షాధిపతియైన ఇంద్రునికి వాహనము భూమి చల్లబడ్డ తరువాత పైకి ఎగసినదే భూమి పెల్లయగు చంద్రుడు. ఈ చంద్రుడు జీవులను పోషించు మగవాడు అయినాడు. వీనికిని వంశాను గతమగు శంఖు, చక్ర గమనములు పట్టినవి. ఇంద్రుడు తనచుట్టూ తాను తిరుగు చూ భూమాతకు ప్రదక్షిణలు చేయదొడగినాడు. పిమ్మట భూమిపై జీవకోటి పుట్టి పెరుగుటకు కావలసినవి. అన్నోదకములు సకల సిరిసంపదములు అష్టఐశ్వర్యములు కలిగినవి.

అనగా శ్రీమహాలక్ష్మి పాలసముద్రమును చిలుకుట వలన దాని నుండి వెలువడినది. ఆమెలోక పాలక శక్తియగు శ్రీ మహావిష్ణువునకు ధర్మపత్నిగా రూపొందినది. ఈమెయే విష్ణుమాయాశక్తి రూపమే జీవులకు అష్ట ఐశ్వర్యముల నొసగి పోషించు తల్లియైనది. ఈజీవులు నిలుచుటకు ఆధారమైన భూమి, సంపదలనిచ్చి పోషించు లక్ష్మియు మహా విష్ణువు యొక్క పత్నులు విశ్వకర్మ వామదేవ ముఖోద్భూతుడైన శ్రీ మహావిష్ణువు యొక్క పరాశక్తి స్వరూపములే.

భూమి బాగుగ చల్లబడి ఘన ద్రవ వాయు పదార్థ సమ్మిళితమైనది. భూమి అక్షము సూర్యునకు 231/2 డిగ్రీలు ఏటవాలుగా మారుటచే సూర్యకాంతి భూమిపై వివిధ రకములుగ ప్రసరించినది. అందుచే పృథ్విపై వేరువేరు శీతోష్ణస్థితులు ఏర్పడినవి.

అనగా అయనములు, ఋతువులు కల్పించబడినవి. వర్షములకు జీవకోటి సృష్టికి అనువగు వాతావరణము పెంపొందినది. భూమి ధృవములందు నీరు తోడుకొని సుమారు 500 అడుగుల ఎత్తు ఎదిగి గడ్డకట్టినది. భూమి నీరు వేరు పడినవి. పాల సముద్ర మధనము వలనపంచభూతాత్మక భూసార నవనీత గుళికలుగ నిద్రావస్థను మునిగియుండు రకరకముల ఓషధములు విత్తులు జీవకణములు ఈ కాలవు కోళ్ళ కడవులో ఉత్పత్తియగు గ్రుడ్లవలె వరిపొట్టను అంకురించు ధాన్యమువలె ఏర్పడినవి. భూపుత్రుడగు చంద్రుడు చల్లబడి పూర్తిగా ఘనీభవించి సూర్యకాంతిని ప్రతి బింబించుచు చల్లని కాంతులు వెదజల్లినాడు ఆ కాంతి ఓషధుల పోషణకు జీవకోటి రక్షణకు కారణమైనది. జీవులకు దివ్య ఆరోగ్య భాగ్యములు కల్పించు ఓషధులు దివ్యశక్తి రూపమే ధన్వంతిరి అను వైద్యుడుగ నారాయణుడు వెలసినాడు. మేఘము నుండి పుట్టిన స్వచ్ఛమగు నీరు విడివడి భూమిపై గల జీవకోటికి అమృతమైవాటి తృష్ణ తీర్చినది. క్షీరసాగర మధనమను ఈ పురాణగాధ భూమి సకల చరాచర జంతుకోటికి దివ్యమాతగ ఎట్లు పరిణామ సిద్ధిని గాంచినది. తెలుపు చున్నది. ఇందు దుష్టశిక్షణ, శిష్టరక్షణలుధర్మోపదేశములు కల్పమురసవంతముగ నిల్చి సాగుటకై దేవదేవుడైన విశ్వకర్మ భగవానుని నిర్ణయములుగ స్పష్టమగును. మరియు ఈ గాధ నరులందు భక్తి భావమును నాటు చున్నది.

హిందువులు పూజా విధానములో మొదటి జ్యోతిని ప్ర[illegible]ళింప చేస్తారు ఎందుకు?. కాలరాత్రి నుండి పంజ్యోతి పుట్టినది. ఇది కల్పారంభాన్ని గుర్తు చేసుకొనుట "ఓం" కారమును ఉచ్చరిస్తాము. సృష్టిలో మొదటనాదవే ఉద్భఇంచినది. దీనినే మనము మనసుతో గంటానాదాన్నిలింటూ తి శబ్దముతో అందరి లోను భక్తి భావమును గర్తుచేస్తున్నాము. కొబ్బరికాయ కొడుతున్నామంటే అందుగల నారాయణలని నీటి రూపమున దర్శించి ఆనీటిని సేవించి మన తప్పలను కడిగేసు కొంటున్నట్లు భావించి పునీతుల మగుచున్నాము. భూమి మొదలు హైడ్రోజన్ మేఘుల వరుకు సమస్త నక్షత్రాలు, పాలపుంతలుగూడ తమ చుట్టూ తాము తిరుగుతూనే తమ మాతృ శక్తుల చుట్టూ తిరున్నాయి. ఈధర్మము అవినెరలేర్చకపోతే అవి ఎక్కడ ఉంటాయి, మనం ఎక్కడ వుంటాము? ఆలోచించచండి. దీనిని గుర్తు చేసి కొనుటకే మనకు ప్రదక్షిణలు చేస్తున్నాము.

మానవులు దేవుని చుట్టు ప్రదక్షిణలు చేసికొనుట ప్రపంచ సృష్టి విశేషములను జ్ఞప్తికి తెచ్చుకొను ప్రయత్నమే లోక వంశమూలపురుషుడగు విశ్వకర్మ భగవానుని వివిధ నామరూపగుణ విశేషములను స్మరించుట పూజించుట భక్తి జ్ఞానములు ప్రవర్ధమాన మగుటకే యగును. అట్టి జ్ఞాన జీవులు తమను కన్నవారికి పెంచిన వారికి తమ గురువులకుప్రభువులకు ( ఈకాలములో ప్రజలే ప్రభులు) తమ్ము గాచి రక్షించు దేవతలకు వారివారి భౌతిక శరీరములకు లేక వారి శవములకు కూడ భక్తితో ప్రదక్షిణలు చేయుట పరిపాటియైనది. వారి నెల్లరును నిండు మనసున గౌరవించి పూజించుటకే వేద విద్య ఇట్లు వికసించినది. ఇది ప్రపంచ సృష్టి విధానమును ప్రకృతి శక్తుల విశేషములను మరల మరల నరునికి జ్ఞప్తికి తెచ్చును. సాంఘికీ న్యాయ ధర్మములను. నిస్స్వార్ధమున పాటింపవానియందు ఉత్సాహము రేకెత్తించును. అందువలన ఆత్మజ్ఞానము ఇనుమడించుట సత్యము. ఆత్మజ్ఞానము వలన పరమాత్మజ్ఞానము సిద్ధించును. పరమాత్మ జ్ఞానము వలన ముక్తియును కలుగును. సర్వ నక్షత్రరాసుల నుండి సూర్యాదిగ్రహములనుండి వివిధ శక్తులు గల తేజోరూప కిరణములు భూమిపై ప్రసరించును. వాటి ప్రభావం వలన క్షీరసాగర మధనం వలనను భూమిపై ఏర్పడిన ఇట్టి వాతావరణ శోభలో చూపుటద్దములపోలు ఘన పధార్ధరూపి విత్తులయందు ద్రవ, ఘన పధార్ధ రూప జీవకణములందు జీవాత్మ లేక జీవ శక్తియను విశ్వకర్మ పరమాత్మయొక్క ఘనాంశముల సారరూపములుగా తెలిసిన పంచ జ్ఞానేంద్రియ ప్రకాశోన్నతులు ద్యోతకమైనవి. చిచ్ఛక్తి ప్రవర్తనలుగా నరునియందు మనోబుద్ధి చిత్త అహంకారములు అత్యుత్తమ స్థితికి పరిణామము చెందినవి. వాటి సమిష్టి జ్ఞానము ప్రపంచ సృష్టిలయములను విమర్శించి గుర్తించగలఅద్వితీయ శక్తిసంపన్నము. అట్లే అది మాయామోహ జనకమై జీవికి శరీరమై తాను అనిపించును. శరీరసుఖమే తనజీవిత ధ్యేయమని పిలుచును. అట్లు జీవిని ప్రపంచమున వీడనీయక అందు బంధించును. భయభ్రాంతుని చేయును. కానీ అదే చిచ్ఛక్తి మానవునకు దివ్యజ్ఞాన ప్రసూనమై నిర్భయుని చేయును. ఇది గుర్తించుట సత్యమగు జ్ఞానము.

భూమిపై ఓషదులు వృద్ధిచెందినవి. అన్నోదములు సర్వజీవులకు సమృద్ధిగా ఏర్పడినవి. ఘనపధార్ధరూప శరీరములు కూడా ఆదిశక్తి, అంచల జడఅంశములగుట సత్యం. అట్టి శరరముగల జీవికి జీవులు పుట్టి వాటియందు మాటలు వృద్ధి చెంది పంచ చలన శక్తులు ఏర్పడినవి. చలనశక్తి రూప సృష్టి స్థితి లయ తిరోధాన అనుగ్రహవలయము ఆవిశ్వకర్మ కరుణాకటాక్ష వీక్షనమువలన జీవకోటి కల్పాంతము నిల్చి సాగుచున్నది. ఆ మహాకార్యము అంతయు ఆదిశక్తియను విశ్వకర్మ పరమాత్మ యందలి చిచ్ఛక్తియొక్క శంఖు, చక్రగమన శక్తుల మహాగుణమే. అది ఎట్లు సంభవించనిది దాని కారణము ఊహాతీతము. మహాశ్చర్యకరము ప్రపంచమందలి సర్వరూపములు అనురూపములు ఆవరణలు సర్వప్రవర్తనలు ఆ మహాదేవుని రూపప్రకాశమే. సృష్టి యందలి వివిధ ద్రవ్యరూప శక్తులే జీవిగుణరూప ప్రవర్తనలకు కారణము. 1. ఏదోఒక ద్రవ్యలోపమువలననే జీవి అజ్ఞాని కుంటి, గ్రుడ్డి, చెవిటి, మూగ, అంగవికలుడు అగుటకు సత్యమగు కారణము. 1. ప్రపంచమే ఆ దేవుని దేహమందు ఏర్పడి సాగు దివ్యమగు టి.వి ప్రదర్శన అందు దర్శకత్వమువహించువాడు సకల పాత్రలు నిర్వహించువాడు దేవదేవుడును. విశ్వకర్మ ఒక్కడే అగుట అత్యాశ్చర్యకరము. ఇట్లు సర్వప్రపంచమందలి ద్రవ్యరాశులు ఒకవంకపెరుగుచూ మరోకవంక పలచబడుచుండుట సహజము..

జీరాసులను 84 లక్షలవరకు ఆకాలమున వేదము లెక్కించినది.

అందు మానవుడు దశేంద్రయ మహాబలమిని భగవంతుని సంతానములో ఉత్తమజీవి వాక్పాటవము బుద్ధివైభవము కలిగిన ప్రజ్ఞానిధి, కనుకనే నాడు సృష్టి పరిణామమున దేవదేవుని మహాద్భుత కార్యముగా ఎట్టి సంశయము లేక స్థిరబుద్ధిని నిర్ధారణ చేయ సమర్థుడైనాడు. 1. స్వీయవంశ మూలపురుషడగు దేవదేవుడైన విశ్వకర్మ భగవానుని భక్తి ప్రపత్తులతో తరించి, పూజించి, గౌరవించి వంశోద్ధారణ కంకణ ధారియైనాడు. ఆపరమ పురుషుని గూర్చి ఋగ్యజుర్వేదములందు ఇట్లు చెప్పబడినది.

శ్లో॥ విశ్వకర్మ విమనా ఆద్విహాయా ధాతా విధాతా పరమోత సంధృక్
తేషా మిష్టాని సమిషా మదన్తి యత్ర సప్తఋషీస్పర ఏకమాహు :

(ఋ.మ.10.సూ 81 మంత్రం 2)

భావము :-

మరీచ్యాది(సప్తఋషులు సప్తఇంద్రియములు లేక సప్త కిరణములు) ఏవిశ్వకర్మతత్వమునందు కలిగి మరల అదే లీనమగుచున్నారో ఆ విశ్వకర్మ సత్య సంకల్పాదులతో గూడిన మనస్సు కలవాడను, జగములను హరించు సంహర్తయు, ఉత్పాదకుడును, పోషకుడును, ఇంకను సర్వశ్రేష్టుడును, సర్వజ్ఞుడును అయి ప్రకాశించునో అట్టి విశ్వకర్మ ఆ సప్తఋషుల కోరికలను స్వేచ్ఛగాతీర్చెను. అందుచేత ఆ ఋషులు సంతసించినారు.

"విశ్వకర్మాదిశాంపతిసన: పశూన్‌పాతుస్తోస్మాన్ పాతు తస్మై నమ: " భావము: ఏ విశ్వకర్మ పరమాత్మ దశదిశలు అధిపతియై సమస్తజీవులను సృష్టించి వాటి వాటి కర్మఫలములను అనుభవింపచేయుచున్నాడో ఆదేవదేవునికి నమస్కారము.

స్వీయవంశమూలపురుషుడగు విశ్వకర్మ భగవానుని భక్తి ప్రవత్తుల తలంచి పూజించి, గౌరవించినవారికి విశేష ప్రయోజనములు సమకూరును.

## పంచబ్రహ్మల ఆవరణములు - విశ్వకర్మ స్థానము

ప్రపంచమందలి సకలవిధములగు ద్రవ్యరాశులయొక్క సృష్టి స్థితి లయ తిరోధాన అనుగ్రహ ప్రవర్తనలతో శోభిల్లు సంపూర్ణ కాల ప్రవాహానికి కల్పమని పేరు. స్థితిశక్తిని నిల్పు కాలరాత్రివలె గతిశక్తిని పరమాత్మ ప్రవర్తించు కల్పము గూడా 432 కోట్ల సంత్సరములు నిరాఘాటముగా నిల్చి సాగుట సత్యశాస్త్రధర్మము. కల్పకాలమందు మాత్రమే పరమాత్మయొక్క విరాటస్వరూపము మనకు ప్రత్యక్షము. కాలరాత్రి సకలము అగోచరము, అచింత్యము. ఈ విరాట్ స్వరూపమందలి పంచతావరణలు

1. హైడ్రోజన్ మేఘావరణము :- ఇదిమనుబ్రహ్మస్థానము. శివస్వరూపము. ఈ మేఘంమునే కాలమేఘంమని చెప్పవచ్చును. ఇది పాలవెల్లుల పుట్టుకకు కారణభూతము. ఇది రుద్ర స్వరూపము ఇందుండి శివ అనెడి ఆదిశక్తి ఉత్పన్నమైనది.
2. పాలవెల్లువావరణము :- ఇది మయ బ్రహ్మ స్థానమైన 'విష్ణు' స్వరూపము. ఇందుండి పరాశక్తి అనబడు మాయాశక్తి జనించినది.
3. నక్షత్రావరణము:- ఇందు ద్వాదశరాశులుండును. త్వష్ట బ్రహ్మ స్థానము. అదే "బ్రహ్మ" స్వరూపము. అందుండి ఇచ్ఛాశక్తి అనబడు అణుశక్తి ఉద్భవించినది. ఈ శక్తినుండియే ఆకర్షణ, వికర్షణ శక్తులు ఉత్పన్నమై జీవుల పుట్టుకకు కారణమైనది. అందుచేతనే బ్రహ్మదేవునికి సృష్టికర్త త్వష్ట ప్రజాపతి అని పేరు కలిగినది.
4. శిల్పి బ్రహ్మస్థానమనబడు అంతరిక్షము :- ఇది ఇంద్రుని స్వరూపము. ఇంద్రుడి క్రియాశక్తి అనబడు విద్యుచ్ఛక్తి కలుగుతుంది. అదే ఉరుములు మెరుపులుగా ప్రత్యక్షము. ఇతడు స్వర్గాధిపతి ఇతడు మేఘములందలి అసురశక్తిని వృత్రాసురుని ఛేదించి వర్షాన్ని కురిపిస్తున్నాడు. నీరే జీవులకు జీవనాధారము. కనుక అట్టి నీటిని ప్రసాదించిన దేవేంద్రుని దేవతలకు రాజుగా ఋష్యాది దేవ గణములు గౌరవించినవి. అంతరిక్షమే మోక్షజీవుల నివాసము.
5. విశ్వయజ్ఞ బ్రహ్మస్థానము:- ఇందు " సూర్యుని "రూపము కాంచనగును.ఇందుండి జ్ఞానశక్తి అనబడు తేజము ప్రసరించుచున్నది. ఈ శక్తియే ఉష్ణశక్తి సమస్త సృష్టి స్థితి,లయములను కారణభూతమగుచున్నది

సూర్యభగవానుడు సర్వదేవతామయుడై శంఖ చక్ర పాశములను ధరించినవాడును చీకట్లనడంచువాడును కర్మసాక్షియు నై సంబోధముద్రతోగూడి నిద్రలో మునిగిన విశ్వమును మేల్కొలుపుచూ ఆ విరాట్ విశ్వకర్మయందు విశ్వజ్ఞ బ్రహ్మ రూపముగా ఉదయించి సృష్టికే ప్రభుడై చతుర్యుగములలోను ప్రకాశించుచుండును.

## " విశ్వకర్మ స్థానము"

పంచావరణముల కవ్వల పరబ్రహ్మో వరణముండును. అందు విశ్వకర్మస్థానముండును. ఆ ఆది పురుషునియందే ఈ సర్వలోకములు , బ్రహ్మాది సర్వదేవతలు పుట్టుచుందురు. అవ్యయుడగు ఆ ఏకైకమూర్తినే విశ్వకర్మయని వేదవేత్తలు చెప్పదురు.

# విశ్వకర్మ తత్వస్వరూపము

మనకంటికి కన్పించు నట్టియు కన్పించ నట్టిదియు అగుభౌతిక ప్రపంచరూపము, మేషాది పండ్రెండు రాసులతో కూడిన ట్టిది దీని వ్యాప్తి అదంత అనంత బ్రహ్మ స్వరూపము. పరమాత్మ లేక భగవంతుడు లేక పరబ్రహ్మయను విరాట్ విశ్వకర్మ స్వరూపము కాలరాత్రి మహాగర్భమున పుట్టి వ్యాప్తి చెందినది. ఈ భౌతిక ప్రపంచము దీని పరిమణము కాలరాత్రియను విశ్వకర్మ ఆవరణలో నాల్గవ భాగము మాత్రమే అని వేదనిర్ధారణ. ఈ భౌతిక ప్రపంచ భాగమును ఆక్రమించు కొనియున్న మూడవ అల్పవృత్త భాగము అనంతాకాశము. దీనిని చుట్టి యున్న వృత్త భాగము దేవదేవుని నిజశక్తి ప్రకాశరూపమే, కాలరాత్రి స్వరూపమే. దీని ఆవరణకు అంతములేదు. ఈ స్థానమే జీవులకు మోక్షస్థానము లేక పరమాత్మ యొక్క పరంధామము లేక సచ్చిదానందము లేక స్వర్గము. 1. ఇదే సత్యమగు ఒకే ఒక విశ్వకర్మ పరమాత్మ నిజరూపము! దీనికే "తత్ సత్" అని అంటారు. ఇది "ఓం తత్ సత్" అను మంత్ర శబ్దము నకు అధిష్ఠాన దేవతా రూపము. "తత్ సత్" అను కాలరాత్రి స్వరూపము "ఓం" అను కల్ప రూపమే చేరి "ఓం తత్ సత్" అను విరాట్ స్వరూపమునకు మంత్ర శబ్ద రూపమైనది.

కాలరాత్రి రూపమున పరమేశ్వరుడు యోగనిద్రలో విశ్రాంతిగైకొనును. అట్లే కల్పమను పగటి కాలమందు అతడు పని చేయును. ఇట్టి కాలరాత్రి కల్పము చేరి ఆయనకు ఒక దివ్యమగు దిన కాలమగును. అట్టి ఒక దినకాలము 864 కోట్ల సంవత్సరములే. ఇట్టి దినములు ఆ దేవదేవునికి ఇప్పటికి ఎన్ని జరిగి పోయినవో ఇక ఎన్ని జరగనున్నవో అను ప్రశ్నలకు తావేలేదు. దేవదేవుని ఈ కాలములు ఒకప్పుడు ఉండునవి. ఒకప్పుడు లేనివి కావు. ఆ మహాశక్తికి పుట్టుక పెరుగుదల నాశనమనునవి లేవు. వాని కాలరూపములు చక్రగమనమున ఒకేరీతిని శాశ్వతముగ ఎట్టి ఆటంకము లేక సాగును. ఆది ఒక అత్యద్భుత శాశ్వతకాల స్వరూపము. సర్వగుణములు రూపములు కల్పించగల అద్వితీయ ఘన ప్రజ్ఞానమునకు సత్య శబ్ధమునకు అర్థమగు ఒకే ఒక మహాశక్తి రూపము. కల్పకాలమందలి భౌతిక ప్రపంచము అందలి సమస్త వస్తు సముదాయము మాయా పదార్థములే. మహేంద్రజాల విద్యాప్రదర్శనాకారములే ఏలనను వాటికి పుట్టుక పెరుగుదల నాశము ఆవరణములున్నవి. అందుచేత అవి అశాశ్వతములు.

కోటాను కోట్ల సంవత్సరములు అందునక్షత్రాదులు బంగారము మొదలగు ఖనిజములు కొన్ని నిల్చిమనుటచే ప్రపంచమే శాశ్వతమని భ్రాంతిని కల్గించుచు జీవులను మోసపుచ్చును. ప్రతినరుడు తన జీవితముశాశ్వతమనే భ్రాంతియందుండి జీవయాత్ర గడుపుచుండును. ఇదంతయు మాయా ప్రభావమే. ఆకాశమందలి నీలిమేఘము వలె ఆదిశక్తి అనేక చిత్ర విచిత్ర ప్రంచమ దృశ్యములను దాల్చును. చిట్టచిట్టవరను అందు మానవ వేషమున తానే ప్రత్యక్షమగును. ఆ శక్తి యొక్క సమిష్టి రూపము విశ్వమైన, వ్యష్టిరూపము మానవుడు. మొదటిది అనంతమగు విరాట్ విశ్వకర్మ మహోస్థూల శరీరము అదే విశ్వరూపము. రెండవది అతి సూక్ష్మము విశ్వము యొక్క ఒక అణుఅంశ కంటె చిన్నది. దీనికే శివుడని పేరు శివ అనగా ఆదిశక్తి అని అర్థము.

కాలరాత్రి కాలమునకు సమానముగ కల్పకాలము 432 కోట్ల సంవత్సరములు నిరాటంకముగ ధర్మమున స్థిరముగ నిల్పి సాగించుటే శాస్త్రయుక్తమగు దైవకార్యము. ఇట్లు నిజేచ్ఛను జరిగించు విశ్వకర్మ పరమాత్మ అద్భుత శక్తికే వాసుదేవుడని వేదము పెలిగినది. ఇది విష్ణువునకు మరియొక పేరు సర్వం విష్ణుమయం అనుటకుఇదే కారణము. ఈ దైవ కార్యము సిద్ధించుటకు ఏర్పడినవే దశావతారములు, విష్ణుదేవుడు అవతారము లెత్తుటలో ముఖ్యముగా క్షేత్ర క్షేత్రజ్ఞ పాలకుడు. శిష్టరక్షణ దుష్ట శిక్షణలతో కూడిన ధర్మ సంస్కరణ శక్తులుగ తోడ్పడ వలసినవాడు మానవ శ్రేష్ఠుడే. దేవ దేవుడైన విశ్వకర్మను గుర్తించి దైవకార్యమును లోక కళ్యాణ సుఖ శాంతులను దిగ్విజయముగ నిర్వహించి చూచుటే మానవుని కర్తవ్యము, ధర్మము అని వేరుగ నొక్కిచెప్పనక్కరలేదు. అత్యంత దయార్ద్ర హృదయముతో సుసంఘీభావమున నిస్వార్థబుద్ధిని పరోపకార చింతనను భూతదయను కలిగి సంఘ నిజ ధర్మములను పూని ఆచరించి నిలబెట్టుయే వాని సుధర్మము, ప్రపంచ సుఖశాంతులను పవిత్రతను నిలబెట్టి కాపాడుటయే మానవుని జీవిత సత్యధ్యేయము.

ఒక జీవి అనంత జన్మలు ఎత్తుచున్నది. కోటాను కోట్ల ఇతర జీవులెందరికో వావివరుసలు లేక భార్యగనో భర్తగనో తల్లిగనో లేక తండ్రిగనో లేదా తనయుడు గానో శత్రువులేక మిత్రుడుగనో ఇంకను అనంత రూపముల అచింత్యమగు అలౌకికమగు

భాంధవ్యములను విచిత్రముగ అనుభవించుచున్నది. అదే జీవిమరల జన్మయెత్తి మరొక జీవికి వావివరసలు మారి చెప్పనలవిగాని చిత్ర విచిత్ర సంఘుబంధ రూపముల, తాపత్రయముల చిక్కుకొను చున్నది. జన్మలు తప్పించుకొన అలవికానివి. పూర్వ జన్మలు గుర్తించగల జ్ఞానికి ఈ జన్మ బాంధ్యవ్యధలు అత్యంత

హేయములే, ఈ నరక బాధలు తప్పించుకొనుటకై వ్యక్తి ప్రతి జన్మను, సంఘనీతిని జీవిఇతము గడుపుటకు వేదము ఆశ్రమ ధర్మమలను ధర్మములను నెలకొల్పినది. వాటిని అనుసరించుచు ఆ జన్మకా జన్మ తన్నుదా ఉద్ధరించు కొనుచు జీవి పవిత్రతను త్రికరణ శుద్ధిగ వృద్ధిచేసికొనుటకు ప్రయత్నించ వలెను. జన్మ ఎత్తిన ప్రతి జ్ఞాన జీవికి పితృమాతృ భక్తి ఏకాగ్ర చిత్తతతో నిస్వార్థ బుద్ధితో సాధించుట జన్మతరించుటకు ఒక ప్రబల కారణమని వేదము చెప్పచున్నది. పురాణములు ఘోషించు చున్నవి. కాల చక్రమున ఒక సారి అజ్ఞానము ప్రబలును. అందువలన ప్రజలందు ధర్మము నిద్రావస్థకు లోనగును. అట్టి అజ్ఞానాంధకారమును తొలగించునే.

అవతార పురుషునిగ పరమాత్మను స్తుతించు గీత యందలి శ్లోకములనుమరియు, మానవుని జీవిత పరమ ధర్మమను గూర్చిన శ్లోకమును చూడుడు.

**శ్లో ॥యానిశా సర్వభూతానాం తస్యాంజాగర్తి సంయమీ।**
**యస్యాం జాగ్రతి భూతాని సానిశాపశ్యతో మునేః॥**
**కవింపురాణ మను శాసితారం అణోరణీయాం సమను స్మరేద్యః।**
**సర్వస్యధాతారమ చింత్య రూపం ఆదిత్య వర్ణంతమసః పరస్తాత్ ॥ గీ॥ 8-9**
**అవ్యక్తాత్ వ్యక్తయః సర్వాః ప్రభవన్త్య హరాగమే।**
**రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవావ్యక్త సంజ్ఞ కే॥ గీ॥ 8-18**
**అవిభక్తంచ భూతేషు విభక్త మివచ స్థితం**
**భూత భర్తృచ తత్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణుచ, గీ॥ 13-16**

పరాత్పరుడు ప్రజ్ఞాన పురుషుడు సర్వలోక శాసన కర్త అణువు కంటె సూక్ష్మాణురపి సర్వరక్షకుడు అచింత్యాకారుడు ఆదిత్య తేజుడు మాయను తొలగించ గలవాడు ప్రొద్దుపొడవగనే
కానరాని మహో స్వరూపమునుండి వాడు సర్వ ప్రపంచ రూపియై తోచును. రాత్రి వచ్చుటతోడనే కన్పడు సర్వ ప్రపంచమును ప్రళయ రూపమున తనలో లయ మొనర్చు కొనును.

**యోగస్థః కురుకర్మాణి సంగం త్యక్త్వా ధనం జయ।**
**సిద్ధ్య సిద్ధ్యోః సమౌ భూత్వా సమత్వం యోగఉచ్యతే॥ గీ॥ 2-48**

ఎట్టి శఅరీ బంధ ములకు లోనగాక లాభాలాభ ములకు జయాపజయములకు చిత్తమును చెదరనీకు నీ కర్తవ్యములను విధులను నిష్ఠను మానస ఏకాగ్రతను పూని శాంతి గలిగి నిర్వర్తించుము. సర్వ సంపదలు నీ సొత్తే యగును. ఇదే నీ జీవిత పరమధర్మము.

## భూమి పై జీవుల సృష్టి స్థితి లయములము

ఇక ప్రత్యక్షముగ మన కంటియెదుట భూమిపైవిశ్వకర్మ భగవానుడు సృష్టి స్థితి, లయ వలయమును కల్పించు సూక్ష్మమగు కార్యసాధక పద్ధతులను గమనింతము. ఇవిఅత్యద్భుతములు ఏకత్వము నుండి అనేక త్వమును రూపొందించు 1.ఆకర్షణ లేక గ్రవిష్ణు లేక ముకుళింపు (Attraction or cotraction ) 2. వికర్షణ లేక వికసనము లేక ప్రభవిష్ణు(Repulsion or Expension )అను రెండు మహాశక్తుల సమ్మేళనలతో కూడినవి. వీటిని పోషించునవే విశ్వకర్మ పరమాత్మ యొక్క చిచ్ఛక్తి ప్రేరణలు (Instincts or Inspirations ) ఈ ఆకర్షణ వికర్షణ శక్తులు విద్యుదయస్కాంత శక్తులలో ధన ఋణ సంజ్ఞలతో నాప్పారును అణుశక్తికి కూడ న్యూక్లియస్ ఎలక్ట్రాన్‌లు అనబడు రెండు శక్తి భేదములున్నవి. ప్రపంచ మందలి సర్వ పదార్థములు అణుశక్తి నుండి ఉద్భవించినదే. అట్లు ప్రపంచమే ద్వంద్వ బలభేద రూప శక్తుల సంపుటిగా నున్నది. ఇట్టి ద్వంద్వ బల భేదములు ఆ అనిర్వచనీయ పరమేశ్వర శక్తికి సహజములే. అవి High and low potential Enegyer.

ఇంత వరకుమనము తెలిసికొనిన బ్రహ్మాండ పిండము నక్షత్రములు అనబడు సూర్యకుటుంబ సముదాయములు ఒక స్వరూపము నుండి రెండవది మహోద్భుత ఆకర్షణ వికర్షణ శక్తుల బలిమిని ఏర్పడుట తెలిసి కొంటిమి. భూమ్యా కర్షణ శక్తి మూలముననే మనము గాలిలో తిరుగు భూమిపై కాలూని నిల్చినాము. చెట్టులోని పండు ఆకాశము లోనికి ఎగిరిపోకుండ భూమి మీదకు రాలుచున్నది. భూమి అను మహాజ్వాలారూపము చల్లబడి ద్రవీభవించుచుండ దానియందలి ఆకర్షణ శక్తి ఫలింతముగా దానిపై సంభవించిన గొప్ప ఉల్కాపాతమున భూమి చిలక బడి భూసార గుళికలుగ రకరకముల విత్తులు జీవకణజాలము, పిండములు, ఓషధులు, అన్నము, రుచులు, వాసనలు, వృక్షజాతి, పశుజాతి, నరజాతి రూపొందినదని తెలుసు కొంటిమి. వికర్షణరూపశక్తి వలన అండ పిండలములు అన్నమున ఎదిగి విస్తరించి జీవకోటి ప్రబలినది.

బ్రహ్మాండ పిండాదుల వికర్షణ రూప జ్వాలా వేగముననే శబ్దశక్తికూడ పుట్టి విస్తరించినది. శబ్దము యొక్క ఆకర్షణ వికర్షణ శక్తి రూపములే పలు విధములగు మాటలు, వాటి ఉచ్చారణలు, లేక భాషలు, ఐన మానవలోక సంఘజీవిత నాటక మందలి నవరస భావ ప్రకటనలనుగుణకర్మ విభాగములచే విద్యా పరిణతను ఏర్పడు బ్రహ్మ, క్షత్రియ వైశ్య శూద్ర జాత్యవతరణలకు కారణములు ఇవే సంఘ ధర్మ నిర్ణయములకు సంస్కృతి కల్పనలకు వేద వేదాంతాది గ్రంథరచనలకు బీజములు ఇవే.

## మంత్రములకు శక్తికలదా?

శబ్దశక్తులే మంత్రములు. అవే అనూహ్యములగు అనేక భావములను కలిగించును. కోకిల కుహూ మధుర ఆలాపనలలో సమ్మోహన సంగీత మలయమారుతమున్నది, సింహగర్జన లో భయంకర అట్ట హాస ప్రపంచ వాతావరణ మేర్పడును. సముద్రఘోషలో ఉదగ్రగాంభీర్యముద్యోతకరమగును. కావు కావుమనుచు కాకులు జగద్రక్షకు నకు ప్రార్థనలు చేయును. చెట్ల యందలి శుక పిక ధ్వనులు అలసిన పాంథుల మనస్సులకు హాయిని గొల్పును. జోల పాటలు బిడ్డలను సుఖ నిద్రకు ముంచును. కాని పిడుగుల గర్జనలు జీవుల గుండెలను బ్రద్దలు చేయును తుఫాను హోరు బీభత్సమును సూచించును. సైరను మ్రోత రానున్న ఉపద్రవమును మోర్సు టెలిగ్రాము పద్ధతిలో ఒక్కొక్క శబ్దము ఒక్కొక్క అక్షరమును గుర్తుచేయును. ప్రేలుడు శబ్దమును బట్టి అది పటాసో లేక తుపాకి యో లేదా తారా జువ్వో లేదా బాంబో తెల్ల వీలగును. మ్రోతను బట్టి అది గుఱ్ఱపు బండో సైకిలో, కారో, బస్సో విశదమగును. భాషా వికాసమున సంగీత సాహిత్యములు నవరస భావములు. స్పష్టముగ వ్యక్తమగును. ఇంత యేల అమ్మా అని పిలిచినపుడు అమ్మ పలుకు తుంది, నాన్నా అని పిలచినపుడు నాన్నే పలుకు తాడు! మన ఎదుట దివ్య శక్తి ఉన్నదని నమ్మి ఆదివ్య శక్తి నామమును ఉచ్చరించినప్పుడు ఆ శక్తితో స్పందన ఏర్పడుతుంది! పదే పదే ఆ శబ్దములను ఉచ్ఛరించినపుడుఅనిర్వచనీయమ్మైన అంతర్గత శక్తులతోసన్ని హితమై ఆత్మ ప్రేరణ ప్రేరణ వలన ఆయా శక్తులు తమ ప్రభావమును చూపును.

వేద ఋషులు తపోబలమున దేహమందలి షట్చక్రములు అందుండి వెలువడు శబ్దాక్షరములు గుర్తించిరి. ఒక్కొక్క అక్షరము నకు పుట్టుక సాధనమును బట్టి ఒక్కొక్క శక్తి కలిగియుండుట ప్రకృతి విశేషమే! శబ్దము లేక ప్రకృతికి పుట్టుకే లేదు! అందుచేతనే నాదము బ్రహ్మ స్వరూపమని చెప్పినారు. భాషా శబ్దములే ప్రకృతి యొక్క శక్తి నిర్దేశకములు. అట్టి శక్తి గల భాషాకూటమే మంత్రము.

"ఓం" అనునది సృష్టి స్థితిలయ శక్తులను భౌతిక ప్రపంచ శక్తిని అనగా విశ్వకర్మ నామక శక్తిని గుర్తుకు తెచ్చు మంత్ర శక్తి బీజము "తత్ సత్" అనునది విశ్వకర్మ నిజరూపమునకు బీజాక్షర సంకేతము. "ఓం తత్ సత్" అనునది విరాట్ విశ్వకర్మ స్వరూపశక్తిని నిర్దేశించు మహామంత్ర బీజము. ఇట్లు వివిధ శక్తులు వివిధబీజాక్షర శక్తులైనవి! ఇట్టి శక్తుల అక్షర కూటమే మంత్రము! ఈ మంత్రములను నమ్మికతో శ్రద్ధగా పట్టు విడువక ఏకాగ్ర చిత్తతతో నేర్చి పఠించిన తప్పక ఫలించును. మంత్రము సిద్ధించును. పురాణము అందలి మంత్రముల పయోజనములు బూటకము కాదు. ధనార్జనకై మాయ మాటలు చెప్పుటకాదు.

# విత్తు ముందా, చెట్టు ముందా?

విశ్వకర్మ యొక్క ఆకర్షణ వికర్షణ శక్తులచే ప్రభవించు ప్రకృతి పురుష నామక ఆదిశక్తి (+) మూలకముల (-) సంయోగము వలన వాయు పదార్థము అందుండి ద్రవపదార్థము అందుండి ఘన పదార్థము అందుండి మరల ద్రవ పదార్థముగా మారును. అట్లే ఆదిశక్తి (+) మూలకముల (-) సంయోగము వలన విత్తనము కలుగు చున్నది. ఆ విత్తనము నుండి మొలక ఆ మొలక వృక్షముగా మారు చున్నది. వృక్షము నుండి అపుష్పము ఆ పుష్పము ఫలముగాను అందు మరల విత్తనములు వాటినుండి మరల అదే జాతి వృక్షముల వృద్ధి ఈ విధముగా భౌతిక పదార్థ భేదరూములను గ్రహించ వచ్చును. ఇందు మూలకములు పుట్టుటకు కారణము ఆకర్షణ శక్తి ఫలమేయగుట పంచభూత సృష్టిలో నిరూపించబడినది. మూలకముల ఆకర్షణ వికర్షణ ఫలమే పై మొదటి అంశమున వాయువు రెండవది విత్తు. మొదటి దానియందు వాయువునకు ఉదాహరణ మేఘరూపములో నున్న నీటి యావిరి. అది చల్లబడి ఆకర్షితమై ద్రవరూపమున నీరు అయినది. వికర్షణ శక్తిచే వర్షించి అది మరల ఆకర్షణ శక్తిచే నదీ నదములు, సముద్రము అయినది. నీరు మరల చల్లబడి ఆకర్షణచే మంచు గడ్డగ మంచు పర్వతములుగా ఉత్తర దక్షిణ ధృవములందు మంచు ప్రదేశములుగ రూపొందినది! ఇవన్నియు లయ కాలమున వికర్షణ శక్తిని కలిగి ద్రవీభవించి తరువాత వాయురూపము దాల్చి, అణువులుగ మారి ఆదిశక్తిలో లీనమగును. రెండవ అంశము నందు మూలకములు ఆకర్షణ వికర్షణ శక్తుల ప్రభావమున భూసార గుళికలుగ విత్తనములైనవి. విత్తనమే బీజకోటి పుట్టి ప్రబలుటకు మూలకారణము. విత్తన వికర్షణ రూపమే మొలక అను దాని బాల్యావస్థ, వృక్షము దాని యౌవనము. అందలి జీవికారణముల ఆకర్షణ రూపమన్మధుని సృష్టి కార్య సాఫల్యమునకై ఏర్పడినదే. పుష్పము అందలి లింగ రూప భేదములు కేసర కీలకములుగా వేర్వై ప్రకాశించుట పుష్పమందలి కణముల వికర్షణ రూపములే. వీటి అన్యోన్య ఆకర్షణ గుణమే పండు ఈ ఫలమందలి వికర్షణ శక్తియే మరల విత్తనములుగ వ్యక్తమగును. వాటి వికర్షణ రూపములు. మూలకములుగ మారి అది లయకాలమున ఆదిశక్తిలో లీనమగును. ఇట్లు సకల విధములగు వాయుద్రవ, ఘన రూప ద్రవ్యముల ందు గ్రహతారకాదులందు జీవకోటి యందు, శబ్ద బ్రహ్మమందు ఆకర్షణ వికర్షణ శక్తుల అమోఘ సృష్టి స్థితిలయ కారక ప్రభావములు మనకు ప్రత్యేక్షములే.

# కల్ప ప్రకాశము - మన్మధుడు

పంచభూతములు సార సమ్మేళనముల నుండి ఆకర్షణ శక్తిచే జనించినదే ఏకకణ జీవి అమీబా మొదలగునవి. వికర్షణ శక్తిని అదే జీవి చీలి దాని జాతి జీవి అనంతముగ వృద్ధి చెందును. మరియొక చోట జీవకణములు ఆకర్షణ శక్తిని మహాద్భుత సంస్కరణలకు లోనై కూడ బహుకణ జీవులైనవి. వికర్షణ శక్తిని ఆ జీవి అదే రూప జీవి పుట్టుచున్నది. ఈ శక్తుల మహాప్రభావముననే ఒకే ఒక మహా సూక్ష్మరూప ధారణగల మఱ్ఱివిత్తనము అనంత విస్తరణ గల మహావృక్షమై అత్యాశ్చరముగ కోటాను కోట్ల అదే మఱ్ఱి విత్తనములను అబ్బురముగ ఇచ్చుచున్నది.

వాయు, ద్రవ ఘన పదార్థ రూపములు గల భూమి పై జీవకోటి సృష్టి విజృంభణకు వికర్షణ రూప మహాశక్తి బలమున స్త్రీ, పుం, నపుంసక లింగ భేదములు ద్యోతకమైనవి. లింగ స్థానములు కొన్ని అత్యాశ్చర్యకరముగ అత్యద్భుత కామసూత్ర బంధములతో ఆలోచనల కందని రీతిని ఆడమగ జంటలుగ అన్యోన్యము ఆకర్షించుకొనుచు క్రీడించుచున్నవి. వంశాభివృద్ధితో సృష్టి స్థిరముగ నిల్చి సాగించుచున్నవి. ఇదే సృష్టని నిల్పి సాగించ నేర్పడిన మహాదేవుని కార్యచరణ మందలి మన్మధుని సృష్టి విశేషము ఇది వాని మహేంద్ర జాల ప్రజ్ఞ.

***సృష్టిని పోషించు నిపుణతలు మర్మములు :-***

లింగ భేదములు తెలియని స్పైరోగైరా అనునట్టి వృక్షజాతిలో రెండు తీగ మొక్కలు ఒకదాని నొకటి ఆకర్షించుకొని భార్యభర్తల వలె ఏకమై విత్తులుగ మారి తీగలు నశించును. వికర్షణ శక్తిని ఆ విత్తులు తీగలగును. కొన్ని కొమ్మలు అంటు గట్టిన అవి కొత్త మొక్కలగును. చెట్లు పుష్పించును. పుష్పములోనే స్త్రీ పురుష బీజములు కేసర కీలముల రూపమున ఆకర్షించు కొనుచు ఫలముల నొసగును. అందు స్వీయ జాతి అదే రకపు విత్తనములను అనంతముగ కనును. పాములు, కాకులు, చేపలు, కోళ్ళు మొదలగు కొన్ని జాతులలో లింగముల తావులు స్పష్టముగ బయటకు తోచి కల్పించవు. కాని అబ్బురము గొల్పు ఆత్మ ప్రబోధము లేక ప్రేరణ వల్ల లింగ భేదముల ఆకర్షణ శక్తి శారీరక ధర్మములను బట్టి ఆయా ఋతు సమయముల యందు ప్రభావితమగును. చిత్రవిచిత్ర కామ శాస్త్ర బంధములకు సృష్టి కల్పితమగును. ఇట్లు స్త్రీ పురుష, బీజ సంయోగమునకు కొత్త సృష్టికి ప్రోత్సాహము కల్గుచుండుట గమనించ వలయును.

అట్లే లింగభేదములు స్పష్టముగ ఏర్పడికనిపించు ఆవు, ఎద్దు కుక్కలు మొదలగు జంతు జాతులను పరికించుడు. అందు మహాకాయముగల ఏనుగులు, అల్ప దేహులగు కాకులు ఒకే విధమగు రతి బంధమున స్ఫురించు స్త్రీ పురుష లింగ సంపర్క క్రియలు ఒక మహదాకర్షణ మహాశక్తి ప్రభావమే. ఈ సంపర్కముల వలన జీవుల శుక్ర, శోణములు కూడి పిండ రూపము దాల్చి ఎదిగి మరల ఆ జాతి జీవి సాధారణముగా ఉత్పన్న మగుచున్నది. ఈ లింగ భేదముల కలయికలో జీవులు తీయని అమృత గుణానుభావముల చిక్కి మదించి రతి మోహమున బడుచున్నది. ఇదే సృష్టి విస్తరణలకు ప్రోత్సాహక శక్తియగు చున్నది. బుద్ధి వికశించని జీవులలో చిత్త కార్తె కుక్కలు సంఘ సంస్కరణలకు దూరమై కొట్లాడుకొనుచు నీచ జీవన ప్రవర్తనలకు లోనగుట స్పష్టపరచును.

ఇట్టి దివ్య సృష్టి నిల్పి సాగుటకు తోడ్పడు అమోఘ మహాశక్తినే మన్మధుడు లేక ప్రద్యుమ్నుడు అని వేదము నిర్ధారించి పేరిడినది. మన్మధుడు సృష్టిని నిల్పిసాగింప తోడ్పడు విష్ణు మహాశక్తికి పుత్ర రత్న శక్తియే. బ్రహ్మ రూప మహాశక్తి సృష్టి కార్యమున నిమగ్నమై యుండ దానిని నిల్పి సాగించు స్థితి కార్యమును పూని నిర్వహించువాడే ప్రద్యుమ్నుడు. వీరిద్దరూ విష్ణువునకు పుత్ర రత్నములే.

## ఆత్మ ప్రేరణలు - అని రుద్రుడు :-

జగన్నిర్మాత, నాధుడు, అగు విశ్వకర్మ భగవానుడు జీవులకు తల్లి, తండ్రి స్వరూపమే అవ్యాజకరుణా సముద్రమే. ఆయన మన వంశ మూల పురుషుడే అట్టివాడు జీవులలో కల్పించు నిస్వార్థమగు మాతృప్రేమ కరుణ త్యాగ బుద్ధులను పరికింతము. జాత్యుద్ధరణకై ముందుగనే ఎట్లు జగదీశ్వరుడు స్ఫురింప జేయునో గ్రహింతము. అత్యల్ప జీవులు కాకులు, బంగారు పిచ్చుకలు ఋతుకాలము సమీపించుటను ముందుగనే చక్కగా గ్రహించును. ఆడమగ జంటలుగ కలిసి ముందుగా తమకు కలుగు సంతానమును ఊహించును. అనువగు చోట అత్యంత చాకచక్యముతో మానవ ప్రజ్ఞను తలదన్ను నట్లు చెదరని చక్కని గూళ్ళు కట్టును. అందు ఆడది గుడ్లు పెట్టును. పొదుగును. మగది సంతాన రక్షణ భారమును వహించును. పిల్లలు బయట పడినంతనే వాటికి ఆ జంట ఆహారము సంపాదించి వేళకు తెచ్చి తినిపించి వాటిని పెంచును. రుచులను అందించును. వయస్సురాగానే వాటికి గాలిలో ఎగురుట నేర్పును.

స్వశక్తిని బ్రతుక నేర్పి తల్లిదండ్రి పక్షులుబిడ్డలను వేరు పరచును. ఇట్లు పక్షిజాతులందు ప్రేమ కరుణ త్యాగ బుద్ధులు ప్రత్యక్షముగా స్పష్టమగుచుండును. ఈ గుణములన్నియు నిర్మలిన ఆత్మ ప్రబోధము వలననే జరుగుట సత్యము.

అట్లే పశుజాతు లందు గూడ ఈగుణములు ప్రస్ఫుటములే కోతులు బిడ్డలను కని కడుపుల నంటి పట్టుకొను విధానమును పిల్లలకు నేర్పి వాటిని ఒంటరిగ విడువక శైశవమున రక్షించి పాలించును. కంగారు అనుమృగమునకు కడుపున సంచియుండును. బిడ్డను ఆ సంచిలో దాచి రక్షించును.

ఇక సరీసృపముల సంగతి అవి ఆత్మ ప్రేరణల ప్రభావమునవే పాముపిల్ల గ్రుడ్డును చీల్చుకొని బయటపడును. ఆవెంటనే ఎదుటనున్న కప్పను ఆహారమని మ్రింగి రుచిగొని క్షుద్బాధ తీర్చుకొనును. దేహ దార్ఢ్యమును పొంది జీవించనేర్చును.

నరులను చేరి జీవించు ఆవులందు ఈగుణములు హెచ్చు స్థితికి చేరును. ఆవు కాన్పు నొప్పులకు ప్రసవవేదనలకు గురియైనది. ఆవుదూడ పుట్టినది. దానికి కదలిపని చేయశక్తి సంపాదనకై ఆకలి యైనది. ఆకర్షణ శక్తిచే ప్రేరేపించబడి తల్లి పొదుగును చేరినది. ముట్టెతో రొమ్మును గుద్ది గీరినది. అంత వరకు పాలు లేని పొదుగున తల్లికి అత్యాశ్చర్యకరముగ పాలుపడినవి. ఆవుదూడ ఒకదానికొకటి మిగుల ఆకర్షితమైనవి. ఇరుప్రక్కల ప్రేమకు ప్రేరణలు ప్రారంభమైనది. ఆప్యాయతతో అంబాయనుచు తల్లి బిడ్డకు చనుగుడిపినది. ఆవుదూడను నాకి దాని శరీరమును శుభ్ర పరచినది. లేగ చనుగీరిపాలు త్రాగి తీపిగుణాను భవమును శరీర బలమును పుష్టిని సుఖమును పొందినది. చనుగుడుపుటతో తల్లియు తీపి సుఖమును చవిచూచినది. ఆ మధురాను భూతియే ఇరుప్రక్కల ప్రేమను పెంపొందించినది. ఫలితముగ బిడ్డకు మాతృరక్షణ పోషణలు ఏర్పడినవి. తెలియకనే తల్లియందు త్యాగబుద్ధి అంకురించినది. ఇవన్నియు ఆత్మ ప్రేరణ జాత్యుద్ధరణకు దివ్య అద్భుత శక్తులే.

***జీవుల సాంఘిక జీవనము :-***

సూర్య కుటుంబ మండలి గ్రహాదుల ఆకర్షణరూప శంఖు చక్రగమన వేగములచే ఏర్పడిన వాటి సాంఘిక ధర్మ శక్తుల వాసనలే జ్ఞానము వికసించుచున్న కొన్ని జంతుజాతులందు వంశానుగతంగా సంక్రమించినవి. వాటియందు సంఘధర్మములు నెలకొనినవి ఒకే చోటనున్న అట్టి ఒకే జాతి జీవులు చేరి ఏకసంఘముగ నిల్చినవి. అట్టి సంఘజీవులు ఒక ఏలిక లేదా సంఘపెద్దను ఎన్నుకొనును.

అవి ఇకనా ఏలికను వీడక వానిచుట్టు తిరుగుచు వాని కనుసన్నల మెలిగి జీవించనేర్చి ఆ సంఘమును శాంతిని సుఖమును స్థిరముగ నిల్పుచున్నవి. ఆ ఏలిక మాటలనుగాని సంజ్ఞలను గాని అవి జవదాటవు.అడవి పందులు ఏనుగులు మొదలగు జాతులు ఇందుకు ఉదాహరణలు. ఇట్టి సాంఘిక జీవన మందు ఇంకను గొప్పగ అభివృద్ధి చెందిన చతుష్పాద జీవులలో చీమలు అత్యున్నత స్థితిని సాధించినవి. అట్టి వాటి ఒక్కొక్క గుంపునకు ఒక్కొక్క ఆడచీమరాణి. అమెకు భర్తలు మెండు. వారిని చేరి ఆమె వేల కొలది గ్రుడ్లు పెట్టి సంతానము నుకని సంఘబలమును వృద్ధిచేయును. ఆమె పెట్టిన గ్రుడ్లను పొదిగి పోషించ అమెకు అమె భర్తలకు నివాసములు తీర్చిదిద్దను. సంఘమునకు ఆహారములు వెదికి పెట్టను నిస్వార్థబుద్ధిని పనిచేయు సేవక చీమలు చాల ఉండును. అవి పుట్టలుపెట్టి అందు సంఘీయుల కొరకు మట్టి కోటలు నిర్మించును. ముందు జాగ్రత్తతో ప్రతి ఆహారపదార్థము వేరు వేరు గదులలో నిలువ బెట్టను వాటికై విశాల మగు కొట్లు కట్టును. ఇట్టి కోటను రక్షించుటకై సైనిక చీమల ఏర్పాటు ప్రతి సంఘమున తప్పక ఉండును.అవి నిర్భయమున నిశ్చింతను శత్రువులతో పోరాడి ప్రాణమును లెక్క జేయక సంఘక్షేమమును కాపాడును. ఇక్కడ ఒక విషయము గుర్తుకు వచ్చుచున్నది. కార్గిల్ సరిహద్దు పోరాటములో భారతీయ సైనికులు తమ ప్రాణాలను లెక్క చేయక స్వార్థ చింతన మాని మనదేశమునకు విజయాన్ని సాధించారు. భారతీయులకు ఎంతో రక్షణను అనందాన్ని చేకూర్చి పెట్టారు. అంతే కాదు ఒకప్పుడు పాకిస్తాన్‌తో జరిగిన యుద్ధంలో కూడ తమ ప్రాణాలకు తెగించి పోరాడి విజయాన్ని సాధించి పెట్టారు. అంతేకాకుండా చైనాతో జరిగిన యుద్ధంలో కూడ తమ దేశభక్తిని నిరూపించుకొన్నారు. దేశాన్ని కాపాడి వారి దేశభక్తిని నిరూపించుకొన్నారు. వారే నిజమైన దేశభక్తులు దేశం కోసం ప్రాణాలర్పించిన వీర జవానులకు సదా కృతజ్ఞులమై యుండ వలసిందే. సైనికుల వలననే సంఘము సుఖశాంతులతో మనును" చీమలకు ప్రత్యేక భాష యున్నట్లులోకమున వినికిడి ఇట్టి మహోద్భుత కార్యాలన్నియు నిర్మలిన ఆత్మ ప్రబోధమున జరుగుచుండుట సత్యము.

సృష్టి పరిణామ సిద్ధిని అత్యుత్తమ గుణరాశియై సంఘజీవిగ వెలసినవాడే మానవుడు. ప్రకృతి యందలి జీవుల జీవన విధానముల పరికించి మంచి చెడ్డలను వివరించుకొను జ్ఞానమాతనికి అబ్బినది. వేద సంస్కృతిలో వాడు. సంఘపవిత్రతను కాపాడలోకహితమును దలచుచు ఆత్మ ప్రబోధముననే వివాహ బంధమును కల్పించుకొనినాడు

భార్య భర్త అను నిర్మలిన హృదయుల జంటలతో ఒక్కొక్క గృహమును ఏర్పాటు చేసికొనినాడు ఆత్మ ప్రేరణల రూపమగు ఆశలే సుఖాన్వేషణలే నరుని బుద్ధి జ్ఞాన విస్తరణలకు కారణమ్మైనవి. సంఘజీవితము గురు శిష్యుల కూటములతో భక్తి జ్ఞానములకు అంకురార్పణ అయినది.

గృహస్థాశ్రమ ధర్మమున వ్యక్తి స్వార్థమును మరచి సంఘోద్ధరణకై పరోపకార చింతనలలో నిమగ్నుడైనాడు వేదవిద్యా పరిణతను సంఘసంస్కరణలు రూపొందినవి. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర పంచమ సంస్థలు సంఘమున వెలసినవి. సాంఘిక కట్టుబాట్లు ధర్మములు వివరింపబడినవి. దుష్ట శిక్షణ శిష్టరక్షణలలో నిర్భయులు స్వార్థమెరుగనివారు. అగు ప్రజాపతులు ఏర్పడినారు. సంఘమున ఒకరి యెడ నొకరు చూపు ప్రేమ ఆదరణలే భగవంతునియందలిభక్తి యైనది. ప్రపంచమే పరమాత్మ రూపమను జ్ఞానమేర్పడినది. ఈ భక్తి పరాకాష్ఠ చెంది ప్రపత్తిగ మారినది. మానవుడు పరంధామమును గ్రహించి అందుచేర నేర్చినాడు. ఈ విశేషములన్నియు తపోబలమున సిద్ధించిన నిర్మలనిశ్చల ఆత్మప్రబోధముల ప్రకాశమే. ఇది సత్యము. ఇట్టి పరమోత్తమ ధర్మములే సనాతన ధర్మములైనవి.

ఇట్లు అత్యల్ప క్షుద్ర జీవులనుండి అత్యుత్తమ మానవజీవి,పర్యంతము నిర్మల నిశ్చల ఆత్మ ప్రబోధముల కారణముగా ప్రపంచమున జాతులు విస్తరించి వృద్ధిచెందినవి. జగన్నిర్మాత రక్షకుడు అగు విశ్వకర్మ పరమాత్మ ఉనికిని తన్నుదా స్పష్టముగా వెల్లడించు కొన్నాడు. ఏలయన ఆకర్షణశక్తి ప్రభావమున జనించినవే అనంతమగు ఆశలు లేక, కోరికలు, సుఖాన్వేషణలు. ఇట్టి కోర్కెలు దీర్చుమంత్రాధిష్ఠాన దేవతలు కూడా లెక్కకు మీరినారు. వీరిని భజించు శక్తియే మావునందలి భక్తి. ఈ భక్తి కి వేదము ఇచ్చిన పేరేగ "అని రుద్ధుడు" అను మహాశక్తి. ఆ శక్తివలననే పరమాత్మను వివిధ భేదరూపముల భక్తుడు చూడగల్గుచున్నాడు. అభీష్టసిద్ధిని పొందుచున్నాడు. ధృవుడు తండ్రి అంక పీఠమును అదిష్ఠింప గోరి విష్ణురూపశక్తిని ఆరాధించి ప్రత్యక్షముగ చూచి ధృవతారగ నిల్చినాడు. అదే భక్తి ప్రపత్తులతో శరీరమునే మరచి పరమేశ్వరుని ఉపాసించి ఉక్కు స్తంభమునుండి భీకర నృసింహమూర్తిని ప్రత్యక్షము కావించు కొన్నవాడే ప్రహ్లాదుడు.

పాతివ్రత్య మహిమతో భక్తిని నదీతీరమందలి ఇసుకను కుండగ చేసి ఇంటికి నీరు కొంపోయినదే జమదగ్ని మహర్షిపత్ని రేణుకాదేవి. మరొక మృత్యుంజయ మంత్రమూర్తిని హృదయమున నిల్పివధింప బడిన భార్యను మరల బ్రతికించినవాడే పరశురాముని తండ్రి జమదగ్ని మహర్షి అనేక దివ్యాస్త్రమహామంత్ర బలిష్ఠుడై ఇరువది యొక్కమారు దండెత్తి దుష్టధరణీ శులనెల్లను దును మాడినవాడే పరశురాముడు. వశిష్ఠుని శిష్యత్వమున ఆత్మ నిజశక్తిని మదిని దాల్చి విశ్వామిత్రుడు, అగస్త్యుడు మొదలగు ఋషీశ్వరుల మంత్రోపదేశముల తోడ్పాటున రావణాది మహాభయంకర దుష్ట రాక్షస శక్తులను నేలకూల్చినవాడే పుణ్యపురుషుడైన శ్రీరాముడు. సకల యోగములు సాధించి యోగీశ్వరుడై మాయను స్వాధీన మందుంచు కొని అమానుష మంత్ర యంత్ర తంత్ర శక్తులు ప్రదర్శించి భక్త రక్షకుడై అధర్మమును అణచినవాడే అర్జున సారధి శ్రీకృష్ణుడు. మన మందరము ఇప్పడు మనశక్తి బట్టి శ్రీ వెంకటేశ్వరుని, నరసింహమూర్తిని, సూర్యనారాయణుని, సత్యనారాయణుని శ్రీశైల మల్లేశ్వరుని బెజవాడ కనక దుర్గమ్మను, సింహాద్రి అప్పన్నను, భద్రాది కోదండ రాముని స్వామి అయ్యప్పను, 16వ శతాబ్దములో నివాసియై శ్రీ పోతులూరి వీర బ్రహ్మేంద్ర స్వామి వారిని 20వ శతాబ్దములోని వాడైన శ్రీషిరిడీ సాయిబాబాను, బుద్ధుని, ఏసుక్రీస్తును మహమ్మదు ప్రవక్తను ఇంకను అనేక దేవతా మూర్తులను కొలిచి తాత్కాలిక ఆత్మబలమును చేకూర్చుకొనుచున్నాము. ఆర్తులు ఆర్థిక బాధలు, అనారోగ్యములు గ్రహపీడాదులనుండి తాత్కాలిక రక్షణను పడయు చున్నారు. "మనకున్న వేద మంత్ర శక్తులు వాటి అధిష్ఠాన దేవతలు ఏడుకోట్లు ఈ దేవుళ్ళందరు. ఆ విశ్వకర్మ పరమాత్మని సూక్ష్మ అంశలు మాత్రమే శాశ్వత జీవన్ముక్తిని ఇచ్చువాడు మూల విరాట్ విశ్వకర్మ గాయత్రి యననొప్ప పరమపురుష శక్తి స్వరూప ఆదిశక్తి ఒక్కటి మాత్రమే మెట్టుమెట్టున తుష్టి పుష్టి కలిగించి జ్ఞానమిచ్చి నిర్భయమున నిష్కామ ఉపాసనాదీక్ష నొసగి నిజభక్తుని నిజతనయుని తన అంక పీఠమున శాశ్వత సచ్చిదానంత పథమున చేర్చుకొను మహాద్భుత దివ్యశక్తి ఒక ఆవిశ్వకర్మ పరాశక్తియే." పగనైనా, వగనైనా, భక్తినైనా, లోకవంశమూల పురుషుని తెలుసుకొని అనిరుద్ధశక్తి అనగా భక్తిని ఆ పరమపురుషుని తెలుసుకొని జీవితాంతము త్రికరణ శుద్ధిని నమ్మి స్మరించు జీవికి సచ్చిదానంద పథము చేకూరక తప్పదు. ఇట్టి శక్తిని కలిగించుట, సంతానమునకు తనను తెలియునేర్పుట, తనలో వానిని చేర్చుకొనుట ఆ విశ్వకర్మ భగవానుని అమృతమయ దివ్య కృపావిశేషమే.

**లయ స్వరూపము - సంకర్షణుడు :-** పై విధముగా సృష్టి స్థితులను మహాశక్తుల ప్రభావములను ప్రపంచమందు గుర్తించితిమి. ఇకలయము ప్రోత్సహించు వికర్షణ రూపశక్తులను తెలియుదము. ఈ వికర్షణ శక్తి ఫలితముగా సర్వప్రపంచము రూపురేఖలు లేకుండా పంచభూతాత్మక మహాగ్ని జ్వాలా రూపియగును. ఆ మహాజ్వాలలను సంకర్షణుడను శక్తి రూపమున కాలరాత్రి తనలో లీన మొనర్చుకొనును. ప్రపంచమంతయు అనంత కాలరాత్రి స్వరూపములో లీనమైపోవును. ఇట్టి లయకారక వికర్షణ శక్తి రూపములు సంకర్షణ నామమున ప్రకృతి లో మనకు సదా ప్రత్యక్షములే. దీపము వెలుగునిచ్చుచూ చమురును వత్తిని హరించును. పాలు మరిగి పొంగి పొంగి పొయ్యి పాలగును. అగ్ని శిఖలచే ఆకర్షింపబడి శలభములు మంటలబడి రూపుమాయును. ఆకలి, దప్పిక రోగాది బాధవలన పశుపక్ష్యాది జీవకోటి నశించును. అడవులలో ఎండుకొమ్మలు రాపాడగ దావానలము పుట్టును. అది మహాటవులనే దగ్ధమొనర్చును సముద్రతీరములందు అద్భుతమగు వాయువులు లేక గ్యాసులు పుట్టి బడ బానలమను పేరున మండును. అందుచే ఉప్పెనలు మహోద్రేకమున ఉరకలిడును. సముద్ర తీరమందున్న సకల జీవకోటి మనుగడ లేకుండామటు మాయమగును. విషక్రిములు వర్ధిల్లి వివిధ భయంకర రోగములు ప్రబలును. అవి చావగా మిగిలిన జీవకోటిని కూడా హరించును. సూర్య బింబమందలి అణుశక్తి హోమజ్వాలా రూపముల ఆకాశములోనికి తన్ను కొని పోవు చున్నది. మనకు తెలిసిన విషయమే. అట్లగు చుండులలే ప్రళయకాలము నాటికి సూర్య బింబమందలి అణుశక్తి బలము అంతయు క్షీణించును.

సూర్యుడు విస్తరించి మహాజ్వాలా రూపమున తన కుంటుంబమునే దగ్ధము చేయును. సూర్య కుంటుంబము నకు ప్రతి నక్షత్రమునకును ఇదే మార్పు ఏర్పడును. నక్షత్రములన్నియు మండి పాలవెల్లి కి విస్తరించును అసంఖ్యకములగు పాలవెల్లులన్నియు ప్రళయ కాలమహాగ్ని జ్వలించును. బ్రహ్మాండ పిండమునకు కూడ విస్తరించి మండి ఇందు లయమగును ఆమహాగ్ని నెమ్మదిగా శాంతి నొంది కాలరాత్రి యొక్క సంకర్షణ రూపశక్తి ప్రభావమునకు లోనై అందులయమగును. సర్వం నిశ్చల శాంత మహా సముద్ర రూపమున నిల్చి పోవును, ఇట్లు "య దృశ్యం తన్నశ్యం" అను ఋషివాక్యం సత్యం.

ఈ విధముగా కాల రాత్రి యందు ఇమిడి యున్న ఆకర్షణ వికర్షణ శక్తులే ఇచ్ఛా శక్తి క్రియా శక్తిల జ్ఞాన శక్తులగును. వాటి మొత్తపు శక్తి కే చిచ్ఛక్తి అని పేరు. ఈ మహాశక్తుల మహాద్భుత పోరాటముల వలననే ప్రపంచమునకు కల్పకాల మందు సృష్టి స్థితి లయములను ఘనశక్తులు మహాశ్చర్యకరముగ సంభవించు చున్నది. ఈ మూడు మహాశక్తులకు మహామంత్ర మూర్తులే ఓంకారశబ్ద పరబ్రహ్మ రూపులు బ్రహ్మ, విష్ణు రుద్రులు. ఈ ప్రపంచము దానిలోని జీవలోక నాటకము స్థిరముగ నిల్చి సాగుటకు ఏర్పడిన వ్యవహార రచనలో రూపొందిన వ్యవస్థలు నాలుగు. అవి వరుసగా వాసుదేవుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, సంకర్షణుడు అనుశక్తి మహా రూపములు. వాటి ననుసరించి వేదము నరుని జీవితమునకు ఇచ్చినవే బ్రహ్మచర్య గృహస్థ వాన ప్రస్థసన్యాసాశ్రమములు వాటి ధర్మములు. అంతయు సనాతన ప్రకృతి యొసగిన ధర్మ శాస్త్రాను గుణములే కాని మూఢములు కావు. ఋషీశ్వరులు తపోబలమున సాధించిన శాస్త్ర పరిశోధనా ఫలితములే సత్యములే వేదమున విస్పష్టములైనవి.



# మానవుడు

"మనోర్జాతా మనుజాః"

మనువు నుండి పుట్టినవాడు మానవుడు.

"మనోరిమే మనవాః"

మనవుసంబంధమైన వారు మానవులు.

"త్వమగ్నే వసూగ్ం రిహ రుద్రా నాది త్యానత
యజా స్వధ్వరం జనం మనుజాతం ఘృతప్రుషం"

"ఓ అగ్నిదేవా నీవీ కర్మయందు వసు రుద్రాదిత్యుల యజింపుము. ఇంకను మను బ్రహ్మనుండికలిగిన జనులను కూడా దేవతా రూపముగా యజింపుము"

జనులు మనువు నుండి కలిగినందునను, ఆ మనువు నిర్మించిన ధర్మములను ఆచరించు వారైనందునను, మానవులు, మనుజులు అయినారు. అనగా

"మనుజాతం - మనునా ప్రజాపతినా ఉత్పాదితమ్" అనినారు. సాధుణులు ఈయనను బ్రహ్మ ప్రజలకు తండ్రి అనెడి విషయమును మరొక మంత్రము కూడా చెప్పుచున్నది.

"యా మధర్వా మనుష్పితా దధ్యజ్‌దియ మత్నత,
తస్మిన్ బ్రహ్మణి పూర్వథేంద్ర ఉక్థా సమక్ష తార్చన్ననుస్వరాజ్యమ్" 1-80-16

అనగా అధరణ్యుడు సర్వప్రజలకు తండ్రియైన మను ప్రజాపతి, అధర్వణుని కుమారుడైన దధ్యఙ్ఙుడు ఏకర్మను విస్తరింప చేసినారో అని భావము. దీన్ని బట్టి మనుబ్రహ్మ ప్రజలకు జనకుడని తెలుచున్నది. మనువు విశ్వకర్మ సుత పంచకములోని సద్యోజాత ముఖ సంభవుడైన మనువు అతడే. సనగుడు అనగా సానగ బ్రహ్మ ఋషి.

**మానవుని జీవిత ధ్యేయము :-** ప్రతీ మానవుడు స్త్రీగానో, పురుషుడుగానో ప్రకృతి స్వభావమున తానే సర్వజ్ఞుడనని మానవునకు ఉండవలసిన ప్రజ్ఞాది గుణములు. సకలముతన సొత్తేయని సదాభావించుచు గర్వియై ప్రవర్తించును. ఎదుటి వానియందు చులకన భావమును వహించును. వాని వ్యక్తిత్వ మందలి లోపములే చూచును. ఇదియే మానవుడు తెలియగ నేరని వాని యందలి గొప్ప అహంకారము. ముక్తికి అహంకారము శూన్యముకావలెను.

జీవలోక నాటకమున ప్రతి ఒక్కరు విడువగ రాని పాత్రధారులే ఏ పాత్ర లోపభూయిష్టమైనను నాటకము రక్తి కట్టని వ్యవహారమగును. ఆంగ్లభాషలో 'పర్వతము ఉడుత' అను చిన్న పద్యము ఉన్నది. అదిఒకప్పుడు వాటి మధ్య ఎవరు గొప్ప. వారన్న వాదన లేచినది. పర్యవసానముగ వచ్చిన నీతి ఏమిటంటే ఎవరు వ్యక్తిత్వం వారి కుండుటచేతనే ప్రపంచము రమ్యముగా నడుచుచున్నది. ఇరువురిలో ఎవరు లేకపోయినను ఒక వెలితి కానవచ్చును.

ప్రజ్ఞా పాటవములు వేరుగాని ఆ దేవుడు అందరినీ ఒకేలా సృష్టించాడు. ఇది మావునకు జీవితమున బాధపడవలెను. అనుభవమునకు రావలెను. అపుడు వానికిసర్వులందు సమసామరస్య భావము నెలకొనును. అణుకువప్రేమ, కరుణ అంకురించును. వాని యందు అహంకారము. అణగారును. కాలమును గమనించుము. అది ఒకే గుణమున సాగదు. ఋతువు లను బట్టి ప్రకృతిలో నవరసములు చిల్కు అనేక గుణముల మార్పులు కన్పించును. అవి కల్పము స్థిరముగ నిల్చి సాగుటకు ఏర్పడిన ధర్మములే. అట్లే జీవలోక నాటక రమ్యతకు మానవునందు అన్నిరకముల గుణములు అవసరమే. ప్రతి వ్యక్తికి తన పాత్ర పోషణే ధర్మము. జీవిత కర్తవ్యము. శాంతి సుఖానుభవమే పరమ లక్ష్యము.

ఇక పరమాత్మలేక పరమేశ్వరి యొక్క సుజ్ఞాన తత్వము మానవునకు సిద్ధించుట పరిణామ సూత్రానుగుణమే యగుటందు సత్యము. ఏ పరిణామ సూత్రమున పరమాత్మ నుండి ఈసూక్ష్మరూప నరదేహము సిద్ధించినదో ఆ సూత్రముననే అది మరల పరమాత్మలో చేరిపోవుట సత్యము. అనగా అట్లు దేవునిలో లీనమగుట. అనేక జన్మల ఆత్మల సంస్కార ఫలమే యగును. అంతదకు ఏ జన్మ కాజన్మను మానవునకు తన ఆత్మను పవిత్రము చేయు సుసంకల్పము పట్టుదల ఏర్పడవలెను. అనగా వాడు సర్వజీవులను తనతో సమానముగా చూడ నేర్వవలెను. దానికి దయాదాక్షిణ్యము. నిర్భయము, ధైర్య సాహసములతో కూడిన త్యాగనిష్ఠ. సంఘసేవ, సంఘమందలి కర్తవ్యపాలనలే సత్య జీవిత ధర్మము కావలెను. అచంచల దివ్య మానసమునచియు జీవిలోక సేవయే పరమాత్మయందు భక్తి ప్రపత్తులుగ మారును. జ్ఞాన వైరాగ్యములకు, నిస్సంగత్వమునకు ముక్తికి దివ్య సోపానములు.

నీవు అల్పశక్తి రూపులగు దేవుళ్లను కొలిచి పూజించి ధ్యానించుటలో నీ ధ్యేయమేమి? ఆ దేవుళ్ల యందు నీకంటే ఎక్కువ గొప్ప శక్తులున్నవను తలంపులే కదా! ఆ నిగూఢశక్తులను తదేకముగ ఏకాగ్రత దృష్టిని తలంచుట వాటిని నీ యందు ప్రతిష్ఠింపచేయు ప్రయత్నమే అగుట సత్యము. నిజముగ ఆ శక్తులు నీకు కొత్తవి అవన్నియూ నీ హృదయసీమను దాగి సుఖ నిద్ర అచంచల దేవతా భక్తి, ధ్యాన నిష్ఠాశక్తులు అను దివ్య వాతావరణములో ఆ బీజములుమొలకెత్తి వికసించును. ఏకత్వమున ఒప్పు నీ మానవశక్తి అనేకత్వము సాధించును. అనగా

అన్ని శక్తులు నీ లోని వేయగును. సత్యముగ నీ నిజహృదయ బలముననే స్త్రీ లేక పురుషుడు అను వ్యక్తిగ రాక్షసత్వమున నీవు దుర్మార్గుడవు దుష్టుడవు కావచ్చు లేక దేవగుణ సద్భావమున సన్మార్గుడవు, సత్పురుషుడవు కావచ్చు. హిట్లరు, డయ్యరు, నెపోలియన్, కాళిదాసు, మహాత్మా గాంధీ, జోన్ ఆఫ్ ఆర్క్, సాయిబాబా, బ్రహ్మంగారు, పద్మావతి, శివాజీ, సమర్థరామదాసు, ఝాన్సీలక్ష్మీబాయి, ఇంకను కొంచెం వెనుకకు వెళ్ళి చూస్తే మహమ్మద్ ప్రవక్త, ఏసుక్రీస్తు మొదలగు ఈ యుగపు వ్యక్తులను తలంచవలె. కానీ ఇట్టి శక్తులు భౌతికములు, శారీరకములు, నీకు కావలసినది అసత్యములకు జ్ఞానేంద్రియ మాయా సుఖములు కావు. సత్యమగు ఆత్మానందమను పరమశాంతి. అది నిర్భయమున నిస్సంగత్వమున, నిస్వార్థబుద్ధిని, నిష్టను, నీ కర్తవ్యములను విధులను పూని నిర్వమించుట వలననే నెమ్మది గా ప్రాప్తించును.

"యోగస్థః కురుకర్మాణి సంగం త్యాక్త్వా ధనుంజయ" అనే సూత్రాన్నే కృష్ణపరమాత్ముడు పలు మార్లు చెప్పినాడు. నరుడు కర్తవ్యముల విధులను కొంచెమును సంకోచించక నిర్వహించ పూనవలె. వాడు సంఘమునకు చేయవలసిన విధులు లేక ధర్మకర్మములు తప్పక చేయవలె. కానీ ఆ కర్మ ఫల హేతువు కారాదు. ఇది నీ జీవిత విధానముల. నీవు త్రొక్కవలసిన సత్యధర్మ పథము. నిజ విశుద్ధాత్మ యందలి అనుపమ అనురక్తి శ్రద్ధ, భక్తి నిష్ఠలే నిన్ను ఇట్టి శాంతి పథమున నిలద్రొక్కును కనుక ప్రతి జన్మను నీ ఆత్మ రూప పరమాత్మనే సదాభక్తిని తలచుము. సర్వశక్తి సంపద్యుక్తుడు సర్వసుఖశాంతి ప్రదాతయగు "విశ్వకర్మ పరమాత్మ" యను దేవదేవుడు. వాడొక్కడే సర్వశక్తి వంతుడు మహిమాన్వితుడు. అక్షరుడు, పరబ్రహ్మ వాని క్షుద్రాంశలేయగు క్షుద్రదేవుళ్లను ఆశించకు. ఇడుమలబడకు. హిరణ్యకశిపుడు, ప్రహ్లాదుడు, దుర్యోధనుడు, ధర్మరాజు, యముడు, మార్కండేయుడు మొదలగు వారిని మదిని తర్కించుము. జన్మ జన్మల శక్తి వంచన లేక శ్రద్ధానిష్టలు పూని ఆ శక్తితో దేవతా సార్వభౌముడగు పరమాత్మనే ఆరాధించ నేర్చుము. సర్వ దేవతా మూర్తులందు నీకిష్టమగు ఆ పరమాత్మ యొక్కఒకే ఒక సత్యరూపమునే ఎల్లెడల సదా తలంచి చూడ నేర్చుము. అడ్డంకులకు జంకకుము, భయపడకుము. నిజ ఆత్మారాధన తత్పరతను వీడకుము. జన్మజన్మల చేయు కృషి ఫలితముగ సకలము నీ ఆత్మ స్వరూపమే యని గుర్తించుటచే నీవు అత్యంత నిర్భయుడవగుదువు. నీ దగు జీవాత్మ స్వీయ పరిపూర్ణ శాంతి మయ సహజ శక్తిని చేరి అది అందు లీనమగుట తప్పదు. కనుకనే శ్రీ కృష్ణ పరమాత్మ "సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం ప్రజ" అని గ్రుచ్చి చెప్పచు నరునకు అభయ మిచ్చినాడు.

వేద విద్యా పరిణతను వెలసిన భారత, రామాయణములందలి వివిధములగు జీవితము లకు ఆదర్శమూర్తులను సదా మదిని తలంచవలె. అందువలన మానవులకు మానవత్వమున ఆయా జీవిత దశయందలి ఆదర్శజీవిత విధానమేమో చక్కగ బోధపడును.

## ఆదర్శకన్య :-

సుజ్ఞానముకల కన్యగా ఆ మూర్తికి ఆదర్శము స్వయం వరమున వివాహ బంధమును కల్పించుకొనుట అనగా ఆమె పుట్టిన ఇంటి గౌరవమును కాపాడుచు. మెట్టిన ఇంటిగౌరవమును తూచిలెక్కించిన పిమ్మట వరుని ప్రేమించి పెండ్లియాడవలె. ముందుగా ఆ ప్రేమికుడు అనకు తన జీవితా దర్శజీవి తగునా, కాదా అని నిదానమున చర్చించుకొని ఆమె ఒక సుస్థిర నిర్ణయ బుద్ధికి రావలె. ఒక స్థిరత్వ మేర్పడిన పిమ్మట ఎట్టి ఉద్రిక్తతలోను ఆమె మనస్సును లేదా చిత్తమును ఏకాగ్రత నుండి తప్పించి మరొక త్రోవ త్రొక్కనీయరాదు. వివాహ జీవిత మనునది సదా ఒక పూలబాట కాదు. అడుగడుగన దారి పొడవున అందు ముండ్లే ఎక్కువ పొడచూపును. జ్ఞానియగు వ్యక్తి సహన శక్తిని నిష్టను కడు జాగ్రత్తగ తొలగించు కొనవలె. ప్రతి ఒక్క జీవితమున కష్ట సుఖములు కావడి కుండలవలె నదిలోని వరదవలె మారుచుండును. అది ప్రకృతి విశేషమే తప్పించనలవి కానిది. ప్రతిజీవిలోక నాటకమున తప్పించుకొననేరని ఒక పాత్రధారి ఈ సూక్ష్మ వివేకమును మనసున నిలుపుకొని ప్రతి వ్యక్తి తన పాత్ర ధర్మములను చక్కగా గుర్తించికొనవలె. వాటిని జీవిత పర్యాంతము ఆ వ్యక్తి జ్ఞానమున నిర్వికారమున, నిష్కామమున పోషించి పాటించవలె. జీవలోక నాటక రమ్యతను కాపాడువలె. ఇట్లు ఏ ఒక్క జ్ఞాన జీవికి స్వార్థమనునది కొంచెము కూడా ఉండరాదనుట వేద విద్య, ప్రస్తుత కాలమున ఆధునిక వనితలు దీనిని ఖండించుచున్నారు. వారికి ఆ స్వేచ్ఛ కలదు. కనుక జ్ఞానముకలకన్యకు సావిత్రి దమయంతులు ఆదర్శం కావలెను. వివాహ యోగ్యత బడసిన కన్యచే రుక్మిణీ కళ్యాణ కావ్యమును చదివించుట యందలి సత్యమగు నీతి ఇదే "కన్యావరయతే రూపం" అనునది ఒక్కటే పూర్ణ సూక్తి కారాదు. అది కామాతురత మగును. దానివలన ఆయురారోగ్య భాగ్యములే చెడును. ఇది ఈ కాలపు సత్య అనుభవమే.

## ఆదర్శ విద్యార్థి :-

విద్యార్థికి ఆదర్శము, గురువునందు సాటిలేని భక్తి విశ్వాసములు జ్ఞానార్జన కొరకు ధర్మ రక్షణ కొరకు అనురక్తి నిరంతర కృషి, పట్టుదల, చిత్త ఏకాగ్రత, మనో నైర్మల్యం, తోటి విద్యార్థులందు ప్రేమ, దయ, క్షమ, ఉపకారబుద్ధి, మానసికము, శారీరకము, ప్రాదేశికము అగు సకల వాతావరణముల యందు శుచిత్వము పాటించి ఆరోగ్య భాగ్యమునకై తపన జీవన విధానమున పొదు పరితనము ఇచ్చి పుచ్చుకొని సుఖించనేర్చు సాంఘిక నీతి. అతి ముఖ్యములు" ఇందులకై విద్యార్థి మనసున నిల్చువారు ధృవుడు, అర్జునుడు కొంతవరకు ఏకలవ్యుడు, శ్రీకృష్ణుడు, మైత్రేయ లోపాముద్ర మొదలగు వారు.

## ఆదర్శ గురువు :-

విద్యా గురువగు వానికి ఆదర్శము ఆవిద్యల యందు ఘనపరిణత తీరని ఆసక్తి తన ప్రజ్ఞకు తగిన ఉత్తమ శిష్యుని వెదకుకొని ఆ విద్యలోక కల్యాణమునకై ఉపకరించి శాశ్వతముగ నిల్చి యుండుటకై సుప్రయత్నము చేయవలె. అట్టి కోవకు చెందిన వారే. విశ్వామిత్రుడు, పరశురాముడు. ద్రోణుడు, మొదలగు వారు. గురుశిష్యుల మధ్య సద్భావన పెంపొందించుటకై వేదము. ఈ దిగువ మంత్రమును పేర్కొన్నది.

వేదము : "ఓం సహనావవతు సహనౌభునక్తు, సహ వీర్యం కరవావహై తేజస్వినా వధీత మస్తు మావిద్విషావహై", ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

తా : సచ్చిదానంద స్వరూపుడగు భగవంతుడు గురుశిష్యులమగు మమ్మిరువుని రక్షించుగాక, ఆ పరమేశ్వరుడు మాకు వివేక విజ్ఞాన ఆనందముల నిచ్చి అనుభవింప జేయుగాక, మేము శారీరక, మానసిక బలవంతుల మగుగాక, అధ్యయన అధ్యాపన ములచే మేమిరువురము తేజోవంతుల మగుగాక, మేము ఒకరినొకరము ద్వేషించక పరస్పరావగాహన అభిమానములతో జీవించుదుము గాక, త్రివిధ (ఆధ్యాత్మిక, అది భౌతిక, ఆది దైవిక) దుఃఖములునశించుగాక.

భావము నెఱింగి ఇట్టి శాంతిమంత్రమును ప్రతినిత్యము పాఠశాలలో విద్యార్థులు ఉపాధ్యాయులు పఠించిన యెడల వారికి మనో వికాసమునకు ఎంతగానో తోడ్పడగలదు.

## ఆదర్శ గృహిణి :-

భార్యగా స్త్రీకి ఆదర్శ జీవితము ఆ వంశమును ఉద్ధరించుట ఆ వంశ గౌరవప్రతిష్ఠలను ఇనుమడింప చేయుట తన జీవితమును సార్థకము చేసికొనుటయే యగును. ఆమె భర్తకు అన్ని విధముల సహకరించుచు భర్త ధ్యానముననే తన్ను దామరువవలెను. భర్త గౌరవ భాగ్యములనే మది నిల్పవలెను. వారి జీవితములో తాను వారితో ఐక్యము కావలెను. అట్లు ఆమె వానికి సత్యమును అర్థాంగి కావలె. ఇదే జ్ఞానవతియగు గృహిణికి శ్రేయోదాయకమైన జీవిత విధానము అనగ ధర్మ స్వరూపలగు భార్యభర్తలు శరీరములు వేరైనను చివరకు వారి మనసులు ఒకటే యగును. వారి మనస్సులందు ఎట్టి విరుద్ధ గుణభావములకు స్థానముండదు. భర్త శాకాహారి భార్య మాంసాహారి యగుట దుష్టమైత్రి, భర్త తెలుగుదేశం సభ్యుడు, భార్య కాంగ్రెసు వాది కారాదు. అట్టి జంటలు సత్య జీవిత భాగస్వాములు కారు. వారు దేశమును దోచుకొను దొంగల ముఠాయొక్క

సభ్యులు మాత్రమే. వారి ప్రవర్తనలు డాంబికములు. జ్ఞానముగల భార్యకు ఆదర్శమే. భరత చక్రవర్తిని కనిపెంచి యిచ్చిన వంశోద్ధారిణి శకుంతల, ద్వితీయ స్వయంవరం. మిషను నలుని శని బాధలనుండి తప్పించి భర్తకు శ్రేయములు కూర్చిన దమయంతి, భర్త గ్రుడ్డిరాజుకాగా తాను ప్రపంచ అద్భుత సుందర విశేషములను చూడనొల్లని గాంధారి, లోక నీలాప నిందలు బాప కరుణా సముద్రుడగు శ్రీరామునికి దూరమైన సత్య సహధర్మ చారిణియగు రాజపత్ని సీతమ్మ పుట్టిన యింటికి మెట్టిన యింటికి దివ్యశోభలు కలిగించిన సావిత్రి మొదలగు వారు కావలెను.

## మాతృమూర్తిగా స్త్రీ :-

మాతృమూర్తికి ఆదర్శము ధర్మ రక్షణపోషణాభి వృద్ధులకై బిడ్డలను కనివారికి తగు విద్య నొసగుట వారికి అదర్శ ప్రాయులగుట, సంతానమందు ఆత్మ స్థైర్యము, ధైర్యసాహసములు, వీరత్వము, ఉదాత్త గుణములు, అహింస, కరుణ, ప్రేమ, సంఘసేవ, సహనము నిస్వా ర్థం, త్యాగనిరతి, పరోపకారము, చిత్తనైర్మల్యము మొదలగు సద్గుణములు విశాల హృదయ భావములు కలిగించు మెలకువలు నేర్చియుండుట అందుకు అట్టి తల్లులకు ఆదర్శము ధృవుని తల్లి సునీత, దక్షిణామూర్తి తల్లి అనసూయ, పాండవులను కనిపెంచిన కుంతి, లవకుశులను వంశోద్ధారకులుగ చేసిన సీతమ్మ కావాలి. ఆధునిక కాలంలో కూడ స్త్రీలు ఆదర్శమణులుగా వాసికెక్కిన వారెందరో గలరు. అట్టి స్థితి చేరుకోవాలంటే మహిళలు విద్యావంతులు అగుట ఎంతైనా అవసరము.

# ఆదర్శ యువకుడు

జ్ఞానము గల యువకునకు జీవిత ఆదర్శము గృహరక్షణ పోషణలు, పితృ మాతృభక్తి, వంశముయొక్కయు, సంఘము యొక్కయు గౌరవోన్నతులకై అవిరళకృషి, సత్యశౌచదయా ధర్మముల పాటింపు, నిస్స్వార్థజీవనము. ఇందులకు ప్రఖ్యాతులు దశంథుని బాణమునకు హతుడైన ఋషికుమారుడు. ధర్మరాజు, ధర్మవ్యాధుడు, శ్రీరాముడు, భీష్ముడు మొదలగువారు. భర్తకు ఆదర్శము, భార్యయందు నిర్మల నిశ్చల ప్రేమానురాగములు సాంఘిక ధర్మ రక్షణ పోషణలు అందులకై నలుడు, శ్రీరాముడు, సత్యభామ భర్త శ్రీకృష్ణుడు, దేవకి భర్త వసుదేవుడు మొదలగు వారి జీవిత విధానములు పలికించ వలెను.

ఉద్యోగము లేక వృత్తికి ధర్మము. కర్మయోగమే. అనగా తనకు ప్రాప్తించు ఎట్టి వృత్తి ధర్మమును ఎట్టి సంకోచములేక చేపట్టవలెను. ఆ పనిలో ప్రేమాభిమానములు శత్రుమిత్రభావములు ఈర్ష్యాక్రోధములు ఎట్టి వారి యందు చూపరాదు. వృత్తికి ఉచ్చనీచములు తలపెట్టరాదు. సర్వులందు కరుణ ప్రేమతో వృత్తిధర్మములను, స్వలాభమును ఎంచక నిర్భయముగ నిర్వర్తించవలెను. ఇదియే ఉద్యోగ ధర్మమగును. వశిష్ఠుడు, విశ్వామిత్రుడు, హరిశ్చంద్రుడు, ధర్మరాజు, కర్ణుడు, భీష్ముడు, ఆంజనేయుడు, ధర్మవ్యాధుడు మొదలగువారి జీవిత విధానములే ఇందుకు ఉదాహరణ

# స్త్రీలేక పురుష వ్యక్తికి ఆదర్శము :-

వంశాభివృద్ధి దాని ఉన్నతులు. ఇట్లు దాని గౌరవోన్నతులకై ప్రాకులాట, భూతదయ, పరోపకార చింతన. లోక కళ్యాణమునకై సంఘ ధర్మ రక్షణలు జీవితమునకు ఆదర్శము కావలెను. సీత, వేదవ్యాసుడు. ఆయన తల్లి సత్యవతి, శ్రీకృష్ణుడు, శ్రీరాముడు, భీష్ముడు మొదలగువారు ఈ భారతావనికి ఆదర్శ ప్రాయులగుదురు. చాలా వరకు సుమతీ శతకము, కుమారి శతకములు ఎల్లరకు ఉపయుక్తములు. నీచజాతి కుక్కల యందు వంశమునకై ( ) అమితమైన విలువ యుండ జ్ఞాన జ్యోతి, బుద్ధికి అద్వితీయుడు, ప్రజ్ఞాన నిధియగు మానవునకు వంశము కంటే జీవితమున ప్రధానమైనది మరొకటి లేదు.

## నరపశువులు :-

సంపూర్ణ కర్తవ్యకర్మలు తెలియని వాడును సర్వకర్మల నెఱుగనివాడు, సమయోచిత సదాచార జ్ఞానహీనుడునైన మూర్ఖుడు వాస్తవముగా పశువేయగును. హింసకుడు సజాతీయ మనుష్యుల నుద్వేగ పరచువాడు, కలహప్రియుడు, ఉచ్ఛిష్టభోజన ప్రియుడు పిరికిపందయగువాడు శునక మనబడును. చంచల స్వభావము కలవాడు, భోజనమునకై యలమటించువాడు, దుమికి దుమికి నడచువాడు, వన నివాసాభిలాషి, వీరిని కోతులని భావింపవలయును. తన కుటుంబీకులకును, యితరులకును చాడీలు చెప్పవాడు పరుల నుద్వేగ పరచువాడు, సర్వసమానుడగు చున్నాడు. బలవంతుడును, ఆక్రమణశీలుడును. లజ్జాహీనుడు. దుర్గంధయుక్త మాంస భక్షణాభిలాషియునైన నరుడు సింహముగా తలంచబడును. దూరదృష్టిలేని మానవులు ఏనుగులుగా పరిగణింపబడుదురు. ఈ విధముగ పాశవిక గుణములున్న మానవులు, మానవులుకారు. పశువులేయనజెల్లును. అసురగుణములు గలవారసురులను నట్లు, పశుగుణములు గలవారు మనుష్య రూపములు దాల్చిన పశువులన దగుదురు.

## నరరూప దేవతలు :

బ్రాహ్మణులను, దేవతలను, అతిథులను, గురువులను, సాధువులను, తపస్వులను పూజించువారును. నిత్యతపోధ్యాన పరాయణులు, నీతి ధర్మరతులు, క్షమాశీలురు, జితక్రోధులు, సత్యవాదులు, జితేంద్రియులు, లోభరహితులు, ప్రియవచనులు, ధర్మశాస్త్రానురాగులు, దయాళురు, లోకప్రియులు, మితభాషణులు, గృశులు, సర్వకార్యదక్షులు, గుణవంతులు, మహాబలవంతులు, సాక్షరులు, విద్వాంసులు, ఆత్మవిద్యోపయోగ కార్యసంలగ్నులు, పంచగవ్యసేవనయందు, నిరామిష భోజన మందునభిరుచి గలవారు, అతిథులకు దాన మొసంగుట యందును, పర్వణాదికార్యముల యందును. సత్త్వవృత్తి గల్గువారును, స్నానదాన, శుభకర్మ, వ్రత, యజ్ఞ దేవతారాధన, స్వాధ్యాయనములందు కాలమును గడుపువారును, దినమునం దొక్క క్షణమ్మైనను వృథా పుచ్చని వారును. మనుష్యరూపమున నున్న దేవతలు వారెల్లరును పూజ్యులు దేవతా సదృశులు.

సర్వేంద్రియములకు మహా ప్రభువే ఇంద్రుడు. సర్వేంద్రియ సుఖభోగములే ఇంద్రలోక భోగములు. భౌతిక సుఖలాలసుడగు ఇంద్రుడు సహస్రాక్షుడై పతితుడై శివవిష్ణువుల ప్రాపకమున వర్తించుట యందలి గాథలు నరునకు సత్యజ్ఞాన దీపికలగుగాక, చిదగ్ని సంభూతములైన సర్వేంద్రియములను చిదగ్ని చేతనే ప్రభావితమన కుండలిన శక్తిని లేపి జయించుటనే దేవకార్యమగును.

భౌతిక సుఖభోగములకు ఏర్పడిన వేక్రతువులు, యజ్ఞయాగాదులు. కాని అవి స్వార్ధముతో కూడినవి కారాదు. సుసంఘ పరములు కావలెను. శ్రీకృష్ణుడు ఇంద్రుని నిరసించుట యందలి నీతిఇదే. నహుషుని చరిత్ర మనస్సున పెట్టవలెను.

నరునకు ఇన్ని ఆశయములు ఏల? ఆ దేవదేవుడే మానవులను సృష్టించి తానే వారిచే బ

ప్రత్యేకించి జీవితమందలి పనులను చేయ సంకల్పించుట ఎందుకు? కానుగా ఏ పనినైనా చేయబూనుట వృథా, శ్రమ అగును కదా! అను సంశయము రాక కూడదు. సత్య ఆత్మ ప్రబోధము గల జీవులకు, జ్ఞానులకు, కర్మ యోగులకు, "కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన" అను భావమున వారి వారి కర్తవ్యములు వారికి సుబోధములేయగును. కాని అజ్ఞానికి ఈ సంశయము నివారణ కావలయును. ఈ సంశయ రూపమున నున్న నీకు దేవ దేవుడు ఉన్నాడు. అను నిశ్చయ భావము సుస్థిరముగా ఏర్పడి యుండవలయును. అంత నా జగదీశ్వరుని ప్రతినిధిగ నీవే వాని పనులు చేయనేర్తువు, దేవుని పూజించుట ప్రార్థించుట ఎందుకు అందు ఇక నాపని ఏమి? అని భీష్మించి ఆదేవుని తదేక దృష్టితో ప్రశ్నించి చూడ స్థిరబుద్ధిని నిల్చియుండుము అట్లుండిన ఈలోక నాటకమున నీవు ఏ పాత్ర ధరించ వలెనో నీ కర్తవ్యమేమో అది నీ అంతట నీవే నీ ఆత్మ ప్రబోధమున తప్పక తెలియగలవు. అట్టి సంకల్పము కూడ నాకెందుకు అందు. అట్టి ఎట్టి సంకల్పములకు తావీయక విధుల, నియమములను వాటిని పాటించక ఒకే స్థిరబుద్ధిని బ్రతుక చూడడము. అది కూడ నీకు దైవము కల్పించిన జీవిత విధానమేయగును. కావున అట్లే నడువుముచలించకుము. నిస్సంశయముగ ఆ జీవితమే నీకు శాంతియననే మో బోధపరచును. దానిని నీవశము నందుంచును

అదే అజ్ఞానాంధకారమును నీ నుండి పారద్రోలును. జ్ఞానానందమయ దీపిక యగుట సత్యము. నీకు జీవితమున వలయు దేవుని సదుపదేశము నీవు పొందగలవు. మరియొకరిని ప్రశ్నించ పనిలేదు. దేనికైనను మనసిసుమంతయు చలించని నీ యొక్క ఏకాగ్రబుద్ధి మంచి ఫలితము నివ్వక మానవదు. నీవు అప్పడు జడ భరతుడవే అగుదువ. కానున్నది కాకమానదు. కొట్టువాడు ఆ దైవమే కొట్టబడువాడు కూడ ఆ దైవమే పని చేయువాడు, చేయించుకొనువాడు ఆ మహాదైవమే. ఇదినాజన్మ కర్మాను భవమున నేమియో స్పష్టపరిచి నిన్ను కర్మవిముక్తుని చేసి ఆ కర్మయోగమున, సచ్చిదానంద పధమున చేర్చును. ఇది సత్యము, నీవెవరు? నీవు నేను ఒక్కటే. ప్రపంచమే నీవు నేను. 'సర్వం ఈ శమయం విశ్వం' కనుక నీది కానిది ఏదియు లేదు. ఈ ప్రపంచమును నీ అత్యుత్తమ సంపదను అన్ని విధముల కాపాడు కొనుటయే నీ ధర్మము.

## ఆత్మజ్ఞానానికి గురువు అవసరమా?

జడభరతుడు ఒక బలిష్టమగు మొదు అందుచేతనే రాజు యొక్క పల్లకీమోత భారము ఎట్టి సంకల్పములేని అతనిపై పడినది. ఆయనకు ఆ పని యందలి సూక్ష్మములు, ధర్మములు తెలియవు కాని ఆయన నోటినుండి ఎట్టి అడ్డుమాట వెలువడలేదు. శక్తివంచన లేక భారము వహించి మారుమాట చెప్పక అపని చేసినాడు. పల్లకీ మోతలో తప్పటడుగులు తప్ప లేదు. తత్కారణముగ రాజు దృష్టిలో పడినాడు. తన ఆత్మ జ్ఞానమును ప్రదర్శించినాడు. రాజునకు ఆత్మజ్ఞానోప దేశకుడు అయినాడు. తాను కర్మ విముక్తుడై పరమాత్మ యందు లీనమైనాడు. సకల శుభములు దైవకటాక్ష ఫలములే యనుట సత్యము.

అయిన జీవి సాంఘిక దుర్నీతిని ద్వేషమును అణచ ప్రయత్నము చేయనక్కరలేదా! అక్కడనే ఉన్నది "కర్మణ్యే వాధి కారస్తే' అను సత్యమందలి నీతి. పురుష కార్యముననే మంచికాని, చెడ్డకాని సిద్ధించుట సత్యము. కనుక నీవు ధర్మముతెలిసిన వాడవే అయిన శాంతి కొరకు ఆ దేవతా సార్వభౌముని ప్రార్థించుము.

నీ వారలందరి చేతను అట్టి ప్రార్థనలు చేయించుము. సంఘ సత్యప్రార్థనలు వృథాకావు. అపుడు అధర్మ నివారణ కొరకు ఒక మహాశక్తి మూర్తి నీ సంఘముననే అవతరించి లోకోద్ధరణ కావించక తప్పదు. అదే దైవ మహోద్భుత శక్తి యొక్క అఖండ ప్రజ్ఞానం

"విశ్వకర్మ జీవుల యొక్క కర్మఫలాను భవము కొరకు జగద్రూపము నందు చున్నాడు. కావున ఈ జగద్రూపము వారి యథార్థకార్యము కాదు. బ్రహ్మాండాకారమున అంతటను ఆవరించియున్నను బ్రహ్మాండ భిన్నముగా నున్నదే అతని సత్య స్వరూపముకాని, బ్రహ్మాండము వాని నిజరూపము కాదని సాధకు లెఱుంగ వలయును. ఈశ్వరుడు జగద్రూపమును తేల్చుట జీవులచే కర్మఫలముల ననుభవింప జేయుటకే యనుట జగము జీవులను మోహ పెట్టుచున్నది. అతని నిర్గుణ స్థితి శాంతిదాయి అగుచున్నది. కనుక జీవులే నాటికయినను ఆకారణ రూప బ్రహ్మము (విశ్వకర్మ) నాశ్రయించిననే అమృతు లగుదురు.

"పురుషసూక్తార్థము"



శ్రీ మద్విరాట్ విశ్వకర్మ

## విశ్వకర్మ ప్రార్థన :

ఓ పూజ్యప్రభూ! క్షమాపరిపూర్ణా! ప్రేమమయా! నీకు నమస్కృతులు సాష్టాంగ ప్రణామములు నీవు సర్వాంతర్యామివి. సర్వశక్తి మంతుడవు. సర్వజ్ఞుడవు. నీవు సచ్చిదానందుడవు. సర్వహృదయాంతరవాసివి.

కరుణార్ద్ర హృదయము, సమదృష్టి, స్థిర మనస్సు, భక్తి విశ్వాస జ్ఞానములను మాకు ప్రసాదింపము. ఆకర్షణల నణగద్రొక్కి. చిత్తవృత్తుల నరికట్టుటకు మాకు వలయు ఆంతరంగికాధ్యాత్మిక శక్తి నొసంగుము.

కామ, లోభ, ద్వేషముల బారినుండి మమ్ములను తప్పింపుము. మాహృదయ ఫలకములను సద్గుణములతో నింపివేయుము.

ఈ సర్వనామరూపములతో నిన్ను తిలకింప నిమ్ము.
ఈ సర్వనామ రూపములతో నిన్ను సేవింపనిమ్ము.
నన్ను సర్వకాల సర్వావస్థల యందు స్మరించు కొననిమ్ము
నీలీలలు సదాగానము చేయనిమ్ము.
నీ నామము సదా మా పెదవులపై నుండ నిమ్ము.
సర్వదా మమ్ములను నీలో నివసింపనిమ్ము. "శ్రీస్వామి శివానంద"

### విశ్వకర్మ స్తుతి

**నమో విశ్వకర్మా నమోదేవదేవ నమో విశ్వకర్మా ...... ॥**
**నమో నిరాకారా నమో నిర్వికార**
**నమో ఓంకారా నమో ప్రణవరూప**
**నమో జ్ఞానరూపా నమో జ్ఞానదాత.**
**నమో పరంజ్యోతీ నమో దివ్యతేజ.**
**నమో పర్మబ్రహ్మ నమో అంతర్యామి ॥ నమో విశ్వకర్మా ...... ॥**
**నమో విరాడ్రూపా నమో విశ్వరూప**
**నమో ఏకరూపా నమో అద్వితీయ.**
**నమో పరశివా నమో లింగ రూప**
**నమో విశ్వకర్మా నమో సృష్టికర్త**
**నమో నమో నమో నమో నమోన్నమః**

"విశ్వకర్మ సాహిత్య రత్న"
కొచ్చెర్ల చిన్మయాచార్య విశ్వకర్మ

సర్వేజనా స్సుఖినో భవంతు.
సమస్త సన్మంగళాని భవంతు
ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః
ఓం తత్సత్.

- దేవుడున్నాడా ?
- ఉంటే ఎక్కడున్నాడు ?
- ఆ దేవుడెవరు ?
- దేవుడను పదమునకు ఋగ్వేదార్థమేమిటి ?
- సృష్టి ఎందుకు చేసాడు ?
- ఎలా చేసాడు ?
- ఎట్లా జరిగింది ?
- దేవుణ్ణి ఎందుకు పూజించాలి ?
- ఎలా పూజించాలి ?
- ఎంతవరకు పూజించాలి ?
- జ్యోతిని ఎందుకు వెలిగిస్తున్నాము ?
- మానవుని ఆదర్శ జీవనమేది ?
- కొబ్బరికాయ ఎందుకు కొడుతున్నాము ?
- ఎందుకు ప్రదక్షిణాలు చేస్తున్నాము ?
- దీపావళి వంటి పండుగలు ఎందుకు చేస్తున్నాము ?
- యుగములు పదునెనిమిదా !
- దివ్యవేద మేమిటి ?
- మానవులందు జాతులు అయిదా !
- పంచభూతములకు పంచబ్రహ్మలు ప్రతీకలా ?
- పంచబ్రహ్మలు గోత్ర ఋషులా !
- హిందువుల మతగ్రంథము ఏది ?
- ఆ మత ప్రవక్త లెవరు ?
- మతమంటే ఇదా ?

మొదలగు ప్రశ్నలకు వేద విజ్ఞానాన్ననుసరించి
సమాధానాల్నివ్వగలిగినదే ఈ “అభినవ గ్రంథము”

**దేవుడు - మానవుడు** (విశ్వకర్మ సృష్టి రహస్యము)

